

కౌసల్య ప్రొడక్షన్స్ వారి

# మంచిరోజులు వస్తాయి

దర్శకత్వం G విశ్వనాథం రచన ఆరుద్ర సంగీతం కోదండపాణి

నిర్మాతలు S భావనారాయణ, P C బాలకృష్ణరాజు



REVATHI


మతిభ్రమించిన
యువకళాకారుని ఉద్రేకాలనూ
ఉన్మాద చేష్టలనూ సహించి
అతణ్ణి ఆటపాటలతో అలరించి
తాను అవమానాలనూ అవహేళనలనూ
భరించి, అతనిలో మరుగుపడిన
కళాప్రతిభకు పునరుజ్జీవం
కలిగించి,
అపూర్వ త్యాగాన్ని ప్రదర్శించిన
అసమాన యువతి
ప్రణయ గాథ....
VKR
ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ చిత్రం
పునర్జన్మ
నిర్మాత
ఎ.వి.సుబ్బారావు
స్క్రీన్‌ప్లే దర్శకత్వం
కె.ప్రత్యగాత్మ

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం 13–9–63
శోభకృన్నామ సం॥ భాద్రపద మాస॥ బహుళ ఏకాదశి
సంపుటము 56 సంచిక 2
స్థాపితము
1908

*

ముఖ్య సంపాదకులు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకులు
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ 13 00 ఇతర దేశాల ఓడమీద (Sea Mail) రు. 20 00 (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ 114 00 అమెరికా రూ 176 50 ఆస్ట్రేలియా 135 00)

*

విడి ప్రతి: 25 న పై.
సంవత్సర చందా: 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1





కొత్తనటి సరస్వతి (ఫొటో. ప్రభాకర్)

## మనలో మాట

శ్రీమతి సి రమాదేవి ప్రస్తుతం అమెరికాలో ఉంటున్నారు స్వానుభవం మీద ఆమె వ్రాసిన 'అమెరికాలో పిల్లల పెంపకం' వ్యాసం వనితాలోకం పఠితలకు నచ్చగలదని ఆశిస్తున్నాము.

* * *

'నా డైరీలో ఒక పేజీ' ఒక నవలిక అనవచ్చు ఈ రచన కథా వస్తువు రచనకే సంబంధించినది 'కథ కోసం కథ' అయినప్పటికీ రచయిత(త్రు)లకి మాత్రమే కాక మామూలు పాఠకులకి కూడా శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారి నవలిక మంచి కాలక్షేపంగా ఉంటుందని మా నమ్మకం!

* * *

'స్త్రీ' (30-8-63 సంచిక) వ్యాసం మీద వచ్చినన్ని ఉత్తరాలు ఇటీవల మరి ఏ వనితాలోకం వ్యాసం మీదా రాలేదు అయితే వనితావాణికి పురుషులు కూడా వ్రాస్తున్నారు వీలయినంతవరకూ వాటిని ప్రచురించటం లేదు!

## లోకం పోకడ



కొడుకు: ఆశ్రిత పక్షపాతం అంటే ఏమిటి నాన్నా?

తండ్రి: పదవుల్లో ఉండేవారికి సాధారణంగా పట్టుకునే ఒకరకమైన వ్యాధి తమ బంధువులకు ఉద్యోగాలు, సహాయాలు చేసిపెట్టటం ఈ వ్యాధి లక్షణం

కొడుకు: అయితే శ్రీ నెహ్రూకూ ఉందా నాన్నా! ఈ జబ్బు?

తండ్రి: ఆయనొక్కడు మినహాయింపురా నాన్నా!



## విషయానుక్రమణిక


**కథలు:**

మెరకచేను — 18
ఏకలవ్యుడు — 22

**సీరియల్ కథలు:**

ప్రేమకు పగ్గాలు — 12
కొలంబా — 20
నా డైరీలో ఒక పేజీ (ప్రారంభం) — 28

**శీర్షికలు, వ్యాసాలు, సినిమా:**

ఉత్తరాలు — 3, ఊవెన్ కార్టూన్ — 6, న్యూఢిల్లీ లేఖ — 7, సినిమా — 9, రాజధాని కబుర్లు — 11, వనితాలోకం — 14, వనితావాణి—15, వారఫలాలు—24, నా అనుభవంలోకెల్లా పెద్ద పరిశోధన (19) — 27, సినిమా రివ్యూ — 55


కాంగ్రెస్ అధ్యక్షపదవి
కేంద్ర మంత్రి పదవి!
అశోక్ మెహతా
కాంగ్రెస్
నేను మాపెద్ద న్నయ్యనుఅను సరిస్తా!
నేను చైనానను సరిస్తా
!
మళ్లా మా అన్నయ్యనే అనుసరిస్తా!

# శస్త్ర చికిత్సకు గురియైన మంత్రివర్గాలు!

శ్రీ కృష్ణ

ఈ వారం అంతా అనుకోని వింతల కాలం. మన ప్రధాన మంత్రి మొట్టమొదట తడవగా వో పెద్ద శస్త్ర చికిత్స చేయటానికి నిశ్చయించి, తనదే ఇంకా పై చెయ్యని నిరూపించుకున్నారు. ఈ పనికి ఆయన్ని వెనక నుంచి ముందుకు నెట్టాల్సి వచ్చింది. లేకపోతే కాంగ్రెస్ పార్టీ విచ్ఛిన్నమైపోవటం, అరాచకం ప్రబలి, భారత దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్నే రక్షించుకోవాల్సిన స్థితి పట్టం జరిగేవి.

మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ చేసిన "పార్టీ సేవకు పదవీ త్యాగం" అనే ప్రతిపాదన ననుసరించి, ఆయనతో పాటుగా, వివిధ రాష్ట్రాల నుంచి, కేంద్రం నుంచి సుమారు మూడు వందలకు పైగా రాజీనామాలు వచ్చాయి. అతి తాజాగా జరిగిన కాంగ్రెస్ సమావేశం ఈ పదవీ త్యాగులలో పార్టీ సేవకు అర్హులైన వారిని ఎన్నుకునే అధికారం ప్రధాన మంత్రికి ఇచ్చిన విషయం తెలిసిందే. కాంగ్రెస్ కార్య నిర్వాహక వర్గం ఇటీవల రెండు రోజులపాటు సమావేశం జరిపి ప్రధాన మంత్రి పథకాల్ని ఆమోదిస్తూ, ఆరు రాష్ట్రాల ముఖ్య మంత్రులు, ఆరుగురు కేంద్ర మంత్రులు ఇచ్చిన రాజీనామాలను ఆమోదించింది. రాష్ట్రాల ముఖ్య మంత్రులలో శ్రీయుతులు కామరాజ్ (మద్రాస్), బి. పట్నాయక్ (ఒరిస్సా), బినోదా నందఝా (బీహార్), సి. బి. గుప్తా (ఉత్తరప్రదేశ్), మండ్లోయ్ (మధ్య ప్రదేశ్), గులాం మహమ్మద్ (కాశ్మీర్)లు, కేంద్రమంత్రులలో శ్రీయుతులు మొరార్జీ దేశాయ్ (ఆర్థిక మంత్రి), యస్. కె. పాటిల్ (ఆహారం, వ్యవసాయం), లాల్‌బహదూర్‌శాస్త్రి (దేశీయ వ్యవహారాలు) గోపాలరెడ్డి (సమాచార శాఖ), కె. యల్. శ్రీమాలి (విద్య) జగజీవన్‌రాం (రవాణా) లు రాజీనామా లిచ్చారు.

రాష్ట్రాలకు సంబంధించినంత వరకు మన ప్రధాన మంత్రి, వెంటనే పదవికి 'వారసులు' దొరికే మద్రాసు, బీహార్ అంతరంగిక తగాదాలవల్ల పరిపాలనకు భంగం కలిగే ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్ లేక ఎక్కువ అవినీతి, దౌర్జన్యం లాంటి అభియోగాలు గల కాశ్మీర్‌లాంటి వాటి ముఖ్యమంత్రుల రాజీనామాలను మాత్రమే ఆమోదించారు.

**చర్చల్లోవున్న రెండు రాష్ట్రాల ముఖ్య మంత్రులను మాత్రం కదిలించ లేదు. అందులో ఒకటి—కేరళ: ఇక్కడ కదిలిస్తే కమ్యూనిస్టులవల్ల ఇబ్బంది ఏర్పడవచ్చు రెండోది పంజాబ్. ఇది పశ్చిమ పాకిస్థాన్‌కు మరీ దగ్గరగా వుండటం ఒక కారణం.**

ఇక కేంద్రానికి సంబంధించినంతవరకు "అభివృద్ధి నిరోధకులు, పాశ్చాత్య అనుకూలురు—" వీళ్ళ పీడ వదిలిపోయిందని కమ్యూనిస్టులు, వారి అనుయాయులు బుజాలెగరేస్తున్నారు. ఈ వర్గం చాలా కాలం నుంచి లోకసభను 'అభ్యుదయ వాదులు— తద్వ్యతిరేకులు' అని విడదీయాలని ప్రయత్నాలు చేస్తూనే ఉంది. వీళ్ళ దృష్టిలో అభ్యుదయ వ్యతిరేకులంటే శ్రీయుతులు దేశాయ్, పాటిల్‌లాంటి వాళ్ళన్నమాట. కాని ప్రధాన మంత్రి తీసుకున్న నిర్ణయం, శాసన సభలకు వెలుపల, లోపలాకూడా కాంగ్రెస్ పార్టీని సుసంఘటితం చేసేందుకు మాత్రమే. ఇప్పుడు కొత్తగా ఏర్పడబోయే మంత్రి వర్గంలో వామపక్షం, తీవ్రవాదులు అంటూ ఉండనే ఉండదు. ప్రధాని



కొత్త ఆర్థిక మంత్రి టి. టి. కె.

నెహ్రూను విమర్శించే వాళ్ళలో ఎవరూ లేరు కనుక కొత్త మంత్రివర్గం సమిష్టిగా కృషి సల్పాలి. అసలు ఏదో యాదృచ్ఛికంగా ఒకటి రెండు సందర్భాలలో తప్ప మంత్రివర్గంలో ఎప్పుడూ భేదాభిప్రాయాలు రాలేదు. ఇప్పుడు ప్రధానమంత్రి మంత్రిమండలిని పదకొండు మందికి తగ్గిస్తారని అనుకుంటున్నారు. అంటే ఆయన ఇప్పుడు ఇంకో ముగ్గుర్ని మంత్రి వర్గంలోలోకి తీసుకుంటే చాలన్నమాట. ప్రస్తుత కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ సంజీవయ్యను వెనుకబడిన కులాల ప్రతినిధిగా, శ్రీ జగజ్జీవనరాంకు బదులుగా కేంద్ర మంత్రివర్గంలోకి తీసుకుంటారని అనుకుంటున్నారు. మిగిలిన ఇద్దరు మంత్రుల పేర్లు త్వరలో ప్రకటిస్తారు.

ఆరుగురు కాబినెట్ హోదా మంత్రులను ఎన్నుకోవట మనేది భారీ ఎత్తున మంత్రివర్గ పునర్నిర్మాణానికే దారి చూపుతుంది. ఈ అవకాశాన్ని. ఆర్థిక వ్యవహారాల శాఖలు చూచే మంత్రి వర్గాల సరామతు కుపయోగిస్తారని ఇక్కడి వారి వ్యూహ.

విడదీసిన పరిశ్రమలను ఒకే మంత్రి క్రిందకు తీసుకు వచ్చే విషయం తీవ్రమైన పరిశీలనలో ఉంది. ఈ విషయమంతా శ్రీ టి. టి. కృష్ణమాచారి చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నది. ఆయనకు గనక ఆర్థిక శాఖ ఇవ్వకపోతే మద్రాసుకు చక్కా చెక్కేస్తారనేది అందరికీ తెలిసిన విషయమే. ఈ రెంటిలో ఏదో ఒకటి తప్ప రాజీ మార్గమంటూ లేనేలేదు. కనుక దేశాన్ని పాలించేటి శ్రీ నెహ్రూవో, ధనం ఘనతో తెలుసుకోవచ్చు. దీన్ని కొంచెం వివరిస్తా. శ్రీ కృష్ణమాచారి వ్యతిరేకంగా, పద్ధతివారీ గూడుపుఠాణీ చాలా జరిగింది. శ్రీ కృష్ణమాచారి మొన్నటి



కొత్త హోం మంత్రి నందా.

ఎన్నికలలో నామినేషన్ దాఖలు చేయగానే, బొంబాయి షేర్ల ధరపడి పోవటం, అదేషేర్ల ధరలు 28 ఫిబ్రవరి 1963 లో శ్రీ మొరార్జీ దేశాయి రు. 61 కోట్ల అదనపు పన్నులు విధిస్తున్నట్టు ప్రకటించగానే పెరిగిపోవటమూ పై గూడుపుఠాణీ నిదర్శనం. 28 ఫిబ్రవరి 63 న జరిగిన బడ్జటు సమావేశం లగాయితు ధనం విలువను నాశనం చేయటం జరిగింది. కొన్ని పాత, కొత్త కంపెనీలను కొత్త పెట్టుబడులు సంపాదించేందుకు అనుమతిస్తూ ప్రతి ఆదివారం ప్రభుత్వం ప్రకటనలు చేసినా, వీటిలో ఏ ఒక్క కంపెనీకి కూడా ముందుకువచ్చి కావాల్సిన పెట్టుబడులను సంపాదించుకునే ధైర్యం లేకపోయిందంటే ధనం విలువ ఎంత పాడైపోయిందనటానికి వేరే నిదర్శనం అక్కర్లేదు. నాకు తెలిసిన ఒకాయన తనకున్న యావదాస్తితో వాటాల కొనుగోలు చేయటం, 28, ఫిబ్రవరి 1963 నుంచి అది వెరసి 4 లక్షలు పడిపోవటం కూడా నేనెరుగుదును.

56 వ పేజీ చూడండి

ఆడంబరాలను విడనాడండి
దేశసంపదను వృధా కానీయకండి




సొగసుగా
కనపడండి...
**'హేజలైన్'**
**సౌందర్య**
**సాధనలలో**
మీ ముఖమును
కలకలలాడేలా
చేసుకోండి

స్నో ★ కోల్డ్ క్రీమ్ ★ టాల్కం

సువాసనగల హేజలైన్ సౌందర్య సాధనలలో ప్రతి ఒక్కటి మీ ముఖమునకు ప్రత్యేకమైన అందమును కలిగిస్తాయి

* " 'హేజలైన్' స్నో '—మీ ముఖమునకు రక్షణనిచ్చి దానికి శోభను చేకూరుస్తుంది
* 'హేజలైన్' కోల్డ్ క్రీమ్ మీ ముఖ చర్మమును బాగుగా శుభ్రపరచి దానిని మృదువుగా ఉండేలా ఉంచుతుంది మీ ముఖము నవనవలాడుతూ యవ్వనవంతముగా కనపడుతుంది
* 'హేజలైన్' టాల్కం సువాసనగల మృదువైన పౌడరు దానిని జల్లుకొంటే మీరు అహా ఎంత చల్లదనము అబ్బా ఏమి తాజాదనము, అరె ఎంత సువాసన అంటారు!











బర్రోస్ వెల్‌కం తయారులు

SWT 10-TEL

# అవీ - ఇవీ - అన్నీ

## బొబ్బిలి యుద్ధం

పైబ్లిక్ ప్రొడక్షన్సువారి బొబ్బిలియుద్ధం చిత్రం ఇప్పటి ఎడిటింగ్ పూర్తి అయింది ... రు పాటలను రికార్డు చేసి— చిత్రీకరణ చేశారు

శ్రీకర కరుణాలవాల—వేణుగోపాల

పై పాట సముద్రాల (జూనియర్)చే వ్రాయబడింది ఈ పాటను భానుమతి పాడింది ...మెతోనే చిత్రీకరణ కూడా చేశారు.

"బలె బలె బలె బలీ. . . .

ఏమయ్యా రామయ్యా ఇలా రావయ్యా !"

ఈ పాటను కొసరాజు వ్రాశారు. స్వర్ణలత, వసంత పాడగా రికార్డు చేయబడింది. ఆంధ్ర ప్రశస్తి గీతాంజలి, స్వర్ణల నృత్యంతో చిత్రీకరణ చేశారు.

"సొగసుకీల్ జడదాన"

పై చరణం శ్రీనాథుడు రచించిన పద్యం లోనిది. ఆ పద్యంలో కొన్ని చరణాలను పాటగా తీసుకొని.

"మురిపించే అందాలే అవి నన్నే చెందాలే"

అనే పై పాటను శ్రీశ్రీ వ్రాశారు. ఘంటసాల, సుశీల పాడగా రికార్డు చేశారు. సీతారాం, జమున పలో చిత్రీకరణ జరిగింది.

"నిను చూడ మనసాయెరా— నా స్వామి"

—జావళి శ్రీశ్రీచే వ్రాయబడింది. సుశీల పాడగా రికార్డు చేశారు. విజయలక్ష్మితో చిత్రీకరణ చేశారు.

ఈ చిత్రంలో యస్. వి. రంగారావు—పాపారాయుడు, యన్. టి. రామారావు—రంగారాయుడు, బాలయ్య — ధర్మారాయుడు, ధూళిపాళ — నర్సారాయుడు, సీతారాం — వెంగళరాయుడు, ముక్కామల—కృష్ణమూర్తి—బుస్సీ, రాజనాల—విజయరామరాజు, యం. ఆర్. రాధ—హైదర్‌జంగ్, సి. యస్. ఆర్—దూబాసి లక్ష్మణో, భానుమతి—మల్లమ్మదేవి, జమున—సుభద్ర (వెంగళరాయుని భార్య), (జూనియర్) శ్రీ రంజని—విజయరామ రాజు భార్య, సురభి బాలసరస్వతి—దాసి వెంకట లక్ష్మి, పద్మనాభం, ఋల్. విజయలక్ష్మి, గీతాంజలి స్వర్ణ నృత్యం. ఈవిధంగా పాత్రాలంకరణ జరిగింది.

మాటలు : గబ్బిట వెంకటరావు— పర్యవేక్షణ, సముద్రాల (సీనియర్), పాటలు : సముద్రాల (జూనియర్), ఆరుద్ర, శ్రీశ్రీ, సి. నారాయణ రెడ్డి, కొసరాజు, సంగీతం : రాజేశ్వరరావు, ఛాయ : కమల్‌ఘోష్, నృత్యం : వెంపటి సత్యం, వసుమతి, కూర్పు : కందస్వామి, స్క్రీన్‌ప్లే : నిర్మాత— దర్శకత్వం : సీతారాం. —

## పెంచిన ప్రేమ

శ్రీ కృష్ణసాయి ఫిలింస్‌వారి "పెంచిన ప్రేమ" చిత్రం ఈ నెలలో విడుదల కానున్నది. ఈ చిత్రంలో యస్. వి. రంగారావు, హరనాథ్, చంద్రబాబు, పి. భానుమతి, జానకి మొదలగు వారు నటించారు. రచన : అనిసెట్టి, సంగీతం : సుదర్శన్, దర్శకత్వం: కృష్ణన్—పంజు.

## సెట్టుమీద 'లక్షాధికారి'

హాల్లోకి మూడు ప్రక్కల నుండి ముగ్గురా వాళ్లు వస్తారు మగవేషంలో ఒక స్త్రీ కూడా ఉంది అందరూ ఎదురుగా ఉన్న ప్లాట్‌ఫారం వేపు చూస్తారు ముందు నీడ— అదే కుంటి మనిషి ఆకారం

తర్వాత అస్పష్టమైన ఆకృతి గంభీరమైన కంఠం —

"అంతా రెడీయేనా ?"

"యస్ ! బాస్ !"

లిల్లీ ! ఈసారి బాధ్యత అంతా నీ కప్పగిస్తున్నాను నీ చేతుల్లో ఉంది జాగ్రత్త !

యస్ ! బాస్ !

టార్జాన్ ! టైగర్ !

యస్ ! బాస్ !

కనీసం ఈ ఎదిహేను రోజుల్లో వది లారీల సరుకు దిగాలి అడ్డం వచ్చినా అనుమానం తగిలినా పాడేవడైనా సరే కాల్చి పారెయ్యండి

(స్త్రీ టోపీ సర్దుకుంటుంది )

'లిల్లీ ! ఇప్పుడు నీపేరు డ్రైవర్ గురవయ్య ! వూ ! గురవయ్యా ! అపాయం వస్తే ?

53 వ పేజి చూడండి



నటి రాజశ్రీ (ప్రభాకర్)

సుందరమైన,
మృదువైన
జుట్టు...



**రాజధానికబుర్లు**

# సమస్యగా పరిణమిస్తున్న మురికివాడలు

'ఫస్ట్‌లిస్ట్' బైటపడింది. ఉద్వాసన అయిన మంత్రుల్లో, ఆంధ్రప్రదేశ్ మంత్రులు లేక పోవటం శోచనీయమని కొందరూ, హర్షదాయక మని కొందరు అనుకొంటున్నారు. అయితే, కామరాజ్ చిట్కాకు 'బలి' కావలసిన మంత్రులు ఇంకా చాలా మంది ఉన్నారనీ, వాళ్ల పేర్లన్నీ గుప్తంగా ఉంచబడినవనీ, ఎప్పుడో వర్జ్యం, వారం చూసుకుని, మళ్లీ ఇంకో ప్రకటన జరుగు తుందనీ అప్పుడు ఆంధ్రప్రదేశ్‌కు ఈ విషయంలో 'అన్యాయం జరగదని' భావించబడుతోంది. పైకి నిబ్బరంగానూ, గాంభీర్యంగానూ కనిపించినా, మన పేరుందేమోనని ప్రతి మంత్రిగారు బుజాలు తడుముకుంటూనే ఉన్నారు. మొన్నీ మధ్య బైటపడ్డ 'లిస్ట్'లో తన పేరు చూసుకుని, మూర్ఛ పోయిన ఒకరిద్దరూ కేంద్రమంత్రులు లేకపోలేదు. అయితే మళ్లీ తట్టుకుని, చిరునవ్వు పెదిమలకు అతికించుకుని, వణుకుతున్న పెదిమ లను, అతికష్టం మీద అదుపులో పెట్టుకున్నా రుట ! అలాంటి ప్రమాదం, రాకండా, మన ఆంధ్రప్రదేశ్ మంత్రులు ఉల్లాసంగానూ, ఉత్సాహంగానూ ప్రవర్తించటానికి, తగిన 'రిహా ర్సల్' చేసుకుంటూ, దైవంమీద భారం వేస్తు న్నారు. ఏమైనా, అనుకోని మార్పులు తప్పని సరిగా రాగలవని, అందువలన ఇప్పటి నుంచే, తగు జాగ్రత్తలో ఉండటము ఎంతైనా అవసర మనీ తాడుమీదన సర్కసు చేస్తున్నారు, కొంత, మంది.

ఆంధ్రప్రదేశ్, అకారాది సూత్రం ప్రకారం ప్రథమ స్థానం ఆక్రమిస్తోంటే (అస్సాం ఉందను కోండి మొదట్లో), మిగతా విషయాల్లో మాత్రం చాలా వెనుకబడి ఉందని, అందరూ ఒకే విమర్శ. పారిశ్రామికంగా హిందూదేశపు పటంలో మన రాష్ట్రానికి అంత ప్రాముఖ్యమైన స్థానం లేదని చాలామంది నిస్పృహ. ముఖ్యమంత్రిగారే ఈ విషయాన్ని పదేపదే అంటూ ఉండటం కూడా వింటూ ఉంటాం, కాని ఈ మధ్య ఈ అపోహ పోవటానికేమో అన్నట్లు, రకరకాల పరిశ్రమలు, హైదరాబాదు ప్రాంతంలో నెలకొల్పటానికి తీవ్ర ప్రయత్నాలు జరిగాయి. ఈ మధ్యనే మౌలాలీలో అంటే, హైదరాబాదుకు అయిదారు మైళ్ల దూరంలో, (విజయవాడ రైలుమార్గంలో స్టేషను) దేశంలో కెల్లా పెద్దపోత కర్మాగారాన్ని, నిర్మించటానికి ప్రారంభోత్సవం జరిగింది. ఇది రిపబ్లిక్ ఫోర్జ్ కర్మాగారము. దీనికి అధ్యక్షులు, మారు నయాపైసల తెలుగువారు డాక్టరు జయంతి ధర్మతేజ. దీంతో 'తారనాక' ప్రాం తంలో ఉన్న, రెండుమూడు చిన్న తరహా పరిశ్రమల లకు కాస్త ఊపు వచ్చింది. ఈ ప్రదేశంలో ప్రయివేటు రంగానికి కాస్త ఆసరావచ్చింది. సనత్ నగర్‌లో చాలా పరిశ్రమలు నెలకొల్ప బడినవి. ఇండస్ట్రియల్ ఎస్టేటు అనే పేరుతో ప్రసిద్ధి కెక్కింది. దీంతో సనత్ నగర్ ప్రాంతం అంతా పరిశ్రమల మయమయింది. పట్నం అటువైపు బాగా పెరిగే అవకాశాలు కనబడుతున్నాయి. ఇంత భారీ యెత్తుగా 'తారనాక' వైపు కూడా పరిశ్రమల అభివృద్ధికి సావకాశం యేర్పడుతోంది.

ఆంధ్రప్రదేశ్ మొత్తం పారిశ్రామికంగా ముందంజ వేయటానికి డాక్టర్ ధర్మతేజ పది హేను కోట్ల రూపాయల పథకం కూడా తయారు చేశారు. దీనివలన విద్యుచ్ఛక్తి ఉత్పత్తి జరుగు తుంది. తర్జన భర్జనలయిన తర్వాత, భారీ విద్యు త్పరికరాల పరిశ్రమ ఇక్కడే ఉంచటానికి నిర్ణ యం తీసుకున్నారు. 'సింథటిక్' డ్రగ్స్ ఫ్యాక్టరీ ఉండనే ఉంది. ఈ మధ్య, పరిశ్రమల మంత్రి గారు చాలా శ్రద్ధ తీసుకుంటున్నట్లు కనబడ తున్నారు. రష్యా సహకారంతో ఎలక్ట్రానిక్ ట్రాన్స్ మిటర్ల ఫ్యాక్టరీ స్థాపించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయన్నారు. పెద్దపెద్ద ట్రక్కులు, లారీలు తయారు చేయటానికి కూడా తగిన కర్మాగారాన్ని నెలకొల్పటానికి నిర్ణయం తీసుకున్నట్లు తెలుస్తోంది. క్రమక్రమంగా పరిశ్రమలు అభి వృద్ధి అవుతున్నకొద్దీ, ఇతర సమస్యలు, ఏమిటో వాటితోపాటు ఉత్పన్నమవుతూనే ఉంటాయి.

మొట్ట మొదటిది, మురికి వాడలు రావటం, దీని వలన పట్నం యొక్క శోభ సౌందర్యం, ఆకర్షణ అన్నీ నశించిపోతూ ఉంటాయి. దీని విషయం కూడా శ్రద్ధ వహించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఇది కూడా కాక, నగరం నిండా, పరిశుభ్రత లోపించిన ఇళ్ల వరసలు యెక్కడ పడితే అక్కడ కావలసినన్ని, అందులో వెలిసేది రెండు వైపుల ఇలాంటి ఇళ్ళు కొల్లలు కొల్లలుగా వెలసినయి. క్రిందటేడు పెద్ద వరదవచ్చి ఇవన్నీ మునిగి పోయినప్పుడు, అందరూ సానుభూతి చూపిం చారు. పతిత జనోద్ధారకులులాగ, వాళ్ల తాలూకు యూనియన్నవాళ్ళు యెంతో హంగామా చేశారు. ప్రధానమంత్రి నెహ్రూ ఇక్కడకు వచ్చినప్పుడు మూసీనది పొంగువలన నష్టపడ్డ ప్రజకు సాను భూతి తెలియ పరుస్తూ, డబ్బుతో సహా, ఒక్క సలహా ఇచ్చారు. అదేమిటంటే ఈ ఏడు జరిగిన ప్రమాదానికి అందరం విచారిస్తూనే ఉన్నాం. కాని అంత మాత్రంతో సరిపోదు. ముందు ఈలాంటి ప్రమాదం, రాకుండా ఉండేట్లు చూడాలని మళ్లీ ఈ గుడిసెలు అక్కడ రాకుండా చూడాలి అన్నారు, అయితే ఆయన మాటవినే దెవరు, మళ్లీ యథాప్రకారం, ఈ వాడు, 'మూసీ'కి రెండు వైపులా మళ్లీ ఇళ్ళు తయారారు.

వర్షాకాలం వచ్చిందంటే, ఇలాంటి ప్రమాదా లకు గురికాకండా తగుజాగ్రత్త వహించాలని హెచ్చరికలు వస్తూనే ఉంటాయి. జరిగేవి జరుగుతూనే ఉంటాయి. పాతబడిన ఇళ్లన్నీ, ముందుగానే కూల్చివేయటం మంచిదని, దాని వలన యెన్నో ప్రాణాలు కాపాడిన వారవుతారని అందరికీ తెలుసు. అయితే ఆ పని చూస్తూ చూస్తూ యెవ్వరికీ చెయ్య బుద్ధి పుట్టదు. ఇల్లును కూల్చటమా అన్నట్లు మెదలకండా వూరుకుంటారు. కాని వానలకు నానినాని అమాంతం కూలిపోతే ప్రాణాలు పోయినవాళ్ల మీద అంద రికీ సానుభూతి ఉంటుంది. ఇదే వింత ప్రకృతి. ఆగాపురం ప్రాంతంలో ఓ పెద్ద 'భవనం' కూలి నలుగుర్ని బలికొన్నది. దీనికి కారకులెవరు! మునిసిపాలిటీ వారవుతే నోటీసు జారీ చేశారుట. ఈ భవనం, నివాస యోగ్యంకాదని, దాన్ని నేల మట్టం చెయ్యాలని, అయితే యజమానులు వప్పుకోనే లేదుట ! నిజమే ఒప్పుకోక పోవటానికి కారణమేమిటో యజమానులు చెప్పచ్చూ, మునిసి పాలిటీ వారు, వారిమీద చర్యతీసుకోక పోవటానికి తామంతట తామే దాన్ని కూల్చివేయక పోవటానికి కారణాలూ చెప్పవచ్చు. అయితే పోయిన ప్రాణాలు తిరిగి వస్తాయా ! ఆ క్షోభ కారణం యేమిటో, ఈ లోపం యెక్కడుందో వెదికి దాన్ని అధిగ మించటానికి ప్రయత్నం చెయ్యవలసిన బాధ్యత అందరీ మీదా ఉంది. ఓ మూల మునిసిపల్ కమి షన్‌గారు బాహాటంగా చెప్పనే చెప్పారు. ఎలక్ట్రి సిటీ డిపార్టుమెంటు, ఫోన్ల శాఖ, నీటిపారుదలకు సంబంధించిన అధికారులకు మధ్య సమన్వయం సహకారం లేదని, రోడ్లను అమాంతం తవ్వేసి, కందకాలు యేర్పరుస్తారు. లోపలన్నించి, తీగెలో గొట్టాలో అమర్చటానికి, ఈ విషయం కార్పొ రేషన్ వారికి తెలియ పర్చారట ! అందువలనే నూతన కమీషనర్‌గారు మిగతా శాఖలకు ఖచ్చి తంగా తెలియపరిచారు. ముందుగా, రోడ్లమీద ఎలాంటి పనిచేయ దలుచుకున్నా, ఆయా శాఖల అధికారులు, తప్పనిసరిగా, మునిసిపాలిటీ వారికి తెలియపరచాలని ఇది తు. చ. అమలు చేస్తే, చిన్న చిన్న ప్రమాదాలు తప్పిపోవచ్చు.

ఓ మూల, పాత ఇళ్ల కూలిపోవటం, రాజ ధాని నగరం రానురాను, పరిశుభ్రత కోల్పో వటం జరుగుతూ ఉంటే, ఈ పట్నాన్ని సుంద రంగానూ, నందన వనంగానూ రూపొందించటానికి పథకాలు వేస్తున్నారు. కొండమీద పార్కు

52 వ పేజీ చూడండి



**ప్రముఖ దేశభక్తుడు శ్రీ అల్లూరి సత్య న్నారాయణరాజుగారు యీనెల 3 వ తేదీ నాడు ఆకస్మికంగా మరణించారు.**

వీరాజీ

## జరిగిన కథ

సురేఖను భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయం చేస్తుంది, పద్మావతి. భాస్కరం సవతి తల్లి జానకమ్మగారు అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది. భాస్కరానికీ; కూతురు వసంతకూ ఒకేసారీ వివాహం చేయాలని ఆమె ఆరాట పడుతుంది. తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్లిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది. పెళ్లికూతురు సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది. సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పట్టుదల పెరుగుతుంది. భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది. ధనమ్మకు దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్లు కూడా అప్పుడే ఏర్పాటు జరుగుతుంది. తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది. చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం; ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో గూడా అనుకోని సురేఖకు తన భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు. చివరకి భాస్కరం తన పెళ్లి ఏడాది వాయిదా వేస్తాడు. ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు. సురేఖ, పద్మ యిద్దరూ ఎం. ఏ లో చేరతారు. భాస్కరం కూడా ఫైనలియర్ పూర్తి చేయటానికి వస్తాడు. సురేఖ అంతా చెప్పిఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు. ఎగ్జిబిషన్‌లో కూడా పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు. భాస్కరం. భాస్కరం స్నేహితుడు మూర్తి శైలజను ప్రేమిస్తాడు. శైలజ కూడా పద్మవతికు సురేఖకు స్నేహితురాలు. జానికమ్మగారు వసంత పెళ్ళి యత్నంలో మునిగి వుంటుంది.

## 33

అందరికీ అన్ని బాధలూ, అన్ని బాధ్యతలూ వదిలిపోయినట్లుంది, ఒక్క సముద్రపొడ్డున మాత్రమే .... పైగా ఎండలు ఇంకా పూర్తి తిరుగు ముఖం పట్టలేదు. సముద్రం అందరిదీను. దాని హోరు, దాని కెరటాలు, దాని ఒడ్డునున్న యిసికా ఎవ్వరూ ఎత్తుకుపోలేరు గాని అందరి బాధలూ, బాధ్యతలు, అలసటా, ఆశా, నిరాశా అన్నీ అది అక్కడ ఉన్న కాసేపూ ఎత్తుకు పోతుంది!

చిన్నపిల్లలకు నత్తగుల్లలు సృష్టిలోకెల్లా విచిత్రంగా అగుపిస్తే, పడుచువాళ్లకు కన్నె పిల్లలు సృష్టిలోకెల్లా తియ్యనిదిగా అగుపిస్తారు—చదువుకుంటున్న నాగరికమైన అమ్మాయిల సన్నంగా నాజుగ్గా, బొద్దుగా నిండుగా, అక్కడా, అక్కడా, అక్కడక్కడా, మన్మథుడి జయపతాకల్లా పయ్యెదలు గాలికెగురుతుంటే — అగుపించటం ద్వారా అబ్బాయిలకు ఆహ్లాదం యిస్తున్నవేళ, శైలజ, సురేఖ, పద్మావతీ, ముగ్గురూ బీచ్‌కి వచ్చారు.

శైలజ సిల్కుచీర ఎర్రంచు పచ్చని పైట నిజంగా అందంగానే ఎగురుతోంది. ఆ అమ్మాయి మనసులో సంద్రపు కెరటాలలాగ ఉల్లాస మున్నది. సురేఖ రెండు జెడలూ ఒకటి వెనక్కు ఒకటి ముందుకి ఉన్నా సరే, ఆ రెండూ, మన్మథుడు కూడా "సవ్యసాచి" యే ననిపిస్తున్నాయి! ఈమధ్య "వాడు" అమ్మాయిల కనుబొమలలోను, చిరుహాసపు పెదాలలోనూ గాదు, నల్లని, మెత్తని వాళ్ల జెడల్లో దాక్కుంటున్నాడు!

పద్మావతి కూడా ఆపూట రెండు జెడలు వేసుకుంది. ఆ అమ్మాయి కురులు చాలా పొడుగేమో, జెడలు రెండూ బుసలు కొడుతున్న తాచుల్లా, ఆమె అడుగుల 'లయ' కనుగుణంగా పిరుదుల మీద నృత్యం చేస్తున్నాయి!

ఈ దృశ్యం సాయంకాలపు సంధ్యకాంతులకు సైతం బహు రంజుగా ఉందేమో .... సురేఖ బుగ్గలమీద, పద్మావతి పెదాలమీద, శైలజ చెవినున్న ఒంటిపొడి 'దుద్దు' ల మీద పచ్చని కాంతులను పొదిగింది.

అట్నుంచి మూర్తీ, భాస్కరం వస్తున్నారు.

మూర్తి "హుర్రే" మన్నాడు. శైలజ పయిటంచు చూస్తేనే చాలు ఈమధ్య ఆ అబ్బాయికి 'హుర్రే' 'హుర్రే' మంటోంది గుండెల్లో.

ప్రక్కనే ఉన్న భాస్కరం గతుక్కు మన్నాడు. పద్మావతీ, సురేఖా ఇద్దర్నీ చూసి తారసపడ్డారు!

"ఆ యిద్దరూ నన్ను ఉత్త స్కౌండ్రల్ ననుకుంటారు బ్రదర్" అన్నాడు.

"నో, నో, శైలజ మంచి అమ్మాయిరా" అన్నాడు మూర్తి.

భాస్కరం పీక పిసుక్కున్నట్లు ఇదై "అది కాదురా నేనూ ......"

"నువ్వా .... శైలజను పిక్‌నిక్ అడగ మన్నావుగా ...." నన్నాడు మూర్తి దూరాన ఉన్న అందాలత్రయాన్ని ఆదుర్దాగా అందుకునే ఉబలాటంతో.

"నీ "జలజ" గారూ ఆ "మంచి గీత" గారూ కూడా గలరు రారా! మిత్రమా!" అంటూ లాగాడు.

"హల్లో" అన్నాడు. పైగా శైలజను రెండడుగుల దూరంలో అందుకున్నంత హడావుడిగా పలకరించాడు.

"అరె! ...."

"ఓఫ్!"

"ఆఁ!? ఉఁ .... మీరా? ...."

అంతా పలకరించుకోడమైంది.

"హాయిగా నో శేరున్నర వేరుశనక్కాయలు తెస్తాను .... మనం కాలక్షేపంగా" అంటున్నాడు మూర్తి.

పద్మావతి కోపంగా భాస్కరం భయంగా సురేఖ జాలిగా — భాస్కరం భయం భయంగా — శైలజ చనువుగా, మూర్తి ఆనందంగా—చూసుకోడంతో వెంటనే ఎవరూ ఎవరికీ సమాధానం యివ్వలేదు.

"అక్కర్లేదులెండి—శేరున్నర వేరుశేనక్కాయలు తింటే వీశ రూపాయిన్నర బెల్లం తినాలి .... అది మా దొడ్డమ్మగారి అటకమీద తప్ప మరోచోట దొరకదు" అన్నది సురేఖ కిలకిలా నవ్వేసి మరీ ....

"దొరుకును, దొరుకును ....." అంటూ పరుగెత్తాడు మూర్తి.

"మూర్తి యీజే వెరీగుడ్ బోయ్!" అన్నాడు భాస్కరం విస్సహాయంగా నిలబడటం యిష్టంలేక శైలజను చూసి.

"మీరు మాత్రం 'శాడ్‌బోయ్' లా ఉన్నారేమ్?" సురేఖ మళ్లీ నవ్వింది.

"నో .... నో .... ఎవరు చెప్పారు ? .... మా పద్మావతి చెప్పిందా ?" నవ్వాడు భాస్కరం. పద్మావతి ఉచ్ఛ్వాస నిశ్వాసాల వడి నదుముకుందికా అన్నట్లు పమిటను రొమ్ము నదుముకునేట్లు లాక్కొని, "మధ్యను నేనెందుకు చెప్పాలి?" అంది.

"అది మీ ఫండమెంటల్ రైట్ గనుకా ....." అన్నాడు అప్రయత్నంగా. బహువచన ప్రయోగం చేసి, సురేఖ, పద్మావతుల నిద్దర్నీ చూశాడు భాస్కరం.

"మనం .... అదో అక్కడ, ఆ పాపాయి లిద్దరూ ఆడుకుంటున్నారే అక్కడ కూచుందాం .... పాపం మూర్తిగారు మనకోసం ...." అంటూ శైలజ పమిటను గాలి కెగరకుండా తీసి పట్టుకుని రెండడుగులు వేసింది.

"ఓ కే"

నడిచారు ముగ్గురూ.

భాస్కరం సురేఖతో అన్నాడు.

"ఎలా ఉందండీ ? వాల్తేర్ వాతావరణం ?"

"ఇంచక్కా ఉంది. బీచ్ కూడా ఇరుకుగానే ఉంది కాని సముద్రం బాగుంది—రెండోది ...."

అంతలో మూర్తి వేరుశనక్కాయల పాకెట్ రుమాలు మూటతో రాగా అతణ్ని చూసి,

"వేరుశనక్కాయలు కూడా బాగుంటాయ్ ..." అని అక్కడే చతికిలబడ్డది సురేఖ.

"నీకు పైత్యం చేస్తుందే." అన్నది పద్మావతి తానుకూడా సాధ్యమైనంతవరకు ఉక్రోషం దాచుకుందికే ప్రయత్నం చేస్తూ ....

శైలజా, భాస్కరం కూచున్నారు.

"దయచేసి నీ చేతి రుమాలు ?" చెయ్యిజాపి అడిగాడు మూర్తి.

"ఎందుకూ ?" భాస్కరం తీసిఇస్తూ అడిగాడు.

పద్మావతి సురేఖను భాస్కరాన్ని గమనించడం మానుకుందామన్నా అవడంలేదు. ఇద్దర్నీ చూస్తోంది అదోలాగ ......

మూర్తి అన్నాడు "ముగ్గు రమ్మాయిగార్లున్నారు ! రెండబ్బాయిలున్నారు ! ఒక వీశెడు .... సారీ ! .... శేరుడు కాయిలున్నారు .... సారీ ఉన్నై ! అవి పంచుటకై ...."

అతని మాటలకు అందరూ కిలకిలా నవ్వేశారు. అబ్బాయిలు క్రాపు సర్దుకుంటే అమ్మాయిలు పయిటలు .... సరిగ్గా తీసుకున్నారు.

ఒక రుమాల్లో కొన్ని కాయలు పోసి "ఇవి మీ, ముగ్గురికీ ...." అన్నాడు మూర్తి. రెండో రుమాలు తనకీ భాస్కరానికీ మధ్య పెట్టుకుని "ఇవి పురుషులకు ప్రత్యేకం" అన్నాడు.

పద్మావతి 'నా కొద్దంది.'

సురేఖ గబుక్కున మొహం కందిపోగా నొచ్చుకుంది. ఏం ? ఎందుకొద్దు. అన్నది కోపంగా.

శైలజ "ప్లీజ్ !" అంటూ కాయ చితక్కొట్టి పద్మావతికి పలుకు అందించింది.

భాస్కరం ఏదో అనబోయి "ఒరే మూర్తీ ! నీకు బుద్ధిలేదురా" అన్నాడు మిత్రుణ్ణి చనువుగా చూసి.

"లేదూ ! .... సరే ! కాని నా బుద్ధికి పద్మావతిగారి టెస్టుకి ముడి ఎక్కడా ?" సాగదీశాడు మూర్తి.

పద్మావతి గ్రహించింది. నలుగురి మధ్య సభ్యతకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నా ననుకుంది.

"సరే .... లింటాలెండ్రా ! .... నన్నెందుకు చంపుతారూ ? కావాలంటే రేపు క్లాసులోనే దగ్గుతానూ" అంది గబగబా నాలుగు కాయలు చేతిలోకి తీసుకుని.

సురేఖ నవ్వాలనే ప్రయత్నం భాస్కరం నవ్వడానికి చేసిన ప్రయత్నం శైలజా మూర్తి గమనించనేలేదు. వాళ్ళు ఒకర్నొకరు దొంగచూపులు చూసుకుంటున్నారు.

"అది సరే గాని, మీరు పద్మావతీ; మా చెల్లాయి పెళ్ళికి తప్పక రావాలి" అన్నాడు భాస్కరం. అని అంతలోనే మరో యిద్దరు వ్యక్తు లుండటం గమనించి "ఒరే మూర్తీ ! నువ్వూ మిస్ శైలజగారూ కూడా రావాలి ..... సర్దాగా గడిచిపోతాయి ఆ నాల్రోజులూ " .... అన్నాడు మూర్తిని చేతో పొడిచి.

ఉలిక్కిపడ్డాడు మూర్తి "ఎప్పుడూ, ఎక్కడికీ ?" అన్నాడు.

శైలజ కూడా ఇంచుమించు అదే ప్రశ్నార్థకాన్ని ఆశ్చర్యార్థకపు భంగిమలో బలపరచింది.

"బాగుందిరా. వరసా ... పైత్యం చేస్తుందీ అంటే నిజంగానే చేసిందా ? మా చెల్లాయి పెళ్ళి శ్రావణంలోనని చెబితినిగా ... "

42 వ పేజీ చూడండి



# అమెరికాలో పిల్లల పెంపకం

సి. రమాదేవి

మేము ఈదేశం 1962 ఫిబ్రవరిలో వచ్చాము. మాకు ఇక్కడ ఒక అబ్బాయి పుట్టాడు. డాక్టర్ల సలహాలతో ఇక్కడ పిల్లలనుపెంచే విధానం మన వాళ్లందరికీ కూడా తెలియపర్చాలన్న ఉద్దేశంతో దీనిని రాస్తున్నాను.

ఇక్కడ కాన్పు, పిల్లల పెంపకం అంతా చాలా క్రమబద్ధంగా జరుగుతుంది. ముఖ్యంగా మనదేశంలోలాగా ఏ చివర సమయానికో, డాక్టరో, నర్సో రావడం, పురుడు పోయటం, అలాటివి ఇక్కడ జరుగవు. ప్రసవాలు అసలు ('డెలివరీస్') అన్నీ ఆస్పత్రిలోనే జరుగుతాయి. రెండోనెల దగ్గరనుండి ఒక డాక్టరుని నియమించుకుంటారు. ఆ డాక్టరే కాన్పు అయిన ఆరు వారాలదాకా తరుచు చూస్తూ ఉంటాడు. పిల్ల పుట్టాక కావలసిన సామానులకు జాబితా, తీసుకోవలసిన జాగ్రత్తలు అన్నీ డాక్టరే చెప్తాడు. పిల్లను మాత్రం బొడ్డుకోసేవరకు ఈ డాక్టరు చూస్తాడు. ఆ తరువాత పిల్లల డాక్టరును ప్రత్యేకంగా నియమించుకోవాలి. ఇంక ఆ డాక్టరు సలహాలతో ఆ పాపలు పెద్దవారు అవుతారు.

పిల్లలు పుట్టంగానే తల్లికి, తండ్రికి చూపించి ప్రత్యేకమైన పిల్లల గది (Nursery)కు తీసుకువెడ్తారు. తల్లి ఆస్పత్రిలో వున్న ఐదు రోజులు పిల్లలను అక్కడ ఉంచుతారు. ఒక్క పాల టైములో మాత్రం తల్లి దగ్గరకు తీసుకువెడ్తారు. ఆ గది అంతా ఒక రకంగా సమమైన "టెంపరేచర్"తో ఉంచుతారు. ఆసుపత్రినుండి ఇంటికి తెచ్చుకునేప్పుడు మనకు, పిల్లలకు చేయవలసిన విషయాలన్నీ చెప్పి, సలహాలను ఇచ్చి పంపుతారు. ఆసుపత్రినుంచి ఇంటికి వచ్చేలోపల పిల్లలకు పేరు చెప్పాలి. ఆ పేరుతో "బర్త్ సర్టిఫికెట్" ఇస్తారు. చదువు మొదలైన వాటికి అది చాలా ముఖ్యం.

మనం పిల్లలకు పుట్టిన దగ్గరినుండి కనీసం నెల రోజులైనా ఆముదం పెడ్తాము. ఇక్కడ ఆముదంకాని, అటువంటి మందుగాని ఇవ్వరు.. అంతా ప్రకృతి సిద్ధంగా జరగాలని అంటారు ఆఖరికి తలకుగాని, ఒంటికిగాని నూనె రాయరు. మామూలుగా శరీరానికి కావలసినది అదే సరఫరా చేసుకుంటుంది. మనము నూనె వాడవలసిన అవసరం లేదు అంటారు. తలకి వంటికి నూనె రాయకపోయినా, విపరీతమైన చలిలో కూడా ఒళ్లు పగులుట, తలపోటు రావటం అంటూ ఏమీ ఉండదు మామూలుగా,

మనమంతా ఇక్కడ మందులు అవి ఎక్కువ వాడుతూ, వాటిమీద ఆధారపడ్తారని అనుకుంటూ ఉంటాము. కాని, కొంచం గమనించి చూస్తే, ఇక్కడే ఎక్కువ ప్రకృతిమీద ఆధారపడ్తారని తెలుస్తుంది. డాక్టర్ల సలహాలు మాత్రం ఎక్కువ తీసుకుంటూ ఉంటారు.

పిల్లలు ఆసుపత్రినుండి ఇంటికి వచ్చిన రెండు వారములు మాత్రము ఒక్క పాలమీదే పెరుగుతారు. ఇచ్చే ఆహారమంతా సూక్ష్మజీవులు లేకుండా (Sterilize) చేసి ఇస్తారు. పోతపాలు, పొద్దుటే కలిపి, సీసాలలో పోసి, ఒక గిన్నెలో నీళ్లు పోసి, దానిలో ఈ సీసాలు ఉంచి ఒక పావు గంట, ఇరవై నిముషాలు మరగనిస్తారు. చల్లారేక రిఫ్రిజిరేటర్‌లోవుంచి, ప్రతి నాలుగు గంటలకు ఒకసారి పడ్తూ ఉంటారు.

ఇక్కడ డాక్టర్లు అందరూ తల్లి పాలను ప్రోత్సహిస్తారు. కాని, తల్లికి ఏమాత్రము ఇష్టము లేకపోయినా. పోతపాలుమీద పెంచుతారు. అసలు కాన్పుకుముందే 'ఏ పాలుమీద (తల్లిపాలు, లేక పోత పాలు) పెంచుతారు?'అని అడుగుతారు. నాకు ముందు తెలియక "తల్లిపాలు సరిపోతాయేమో లేదో ఎలా తెలుస్తుంది" అని అడిగాను. తల్లిపాలు సరిపోకపోవడం అంటూ ఉండదని, అదంతా మన మీద ఆధారపడి ఉంటుందని చెప్తారు. ముఖ్యంగా పాలు కనుక ఇస్తే "బ్రెస్ట్ కాన్సర్" రావటానికి అవకాశం తక్కువని చెప్పారు.

పాలు పట్టడం పూర్తి కాగానే పిల్లలను బుజాన పడుకోపెట్టుకుని "జో" కొట్టినట్టుగా చేస్తారు. అలా చేస్తే పిల్లలకు తేనుపులాగా వస్తుంది. అలా కనుక వస్తే పాలు త్రాగు తున్నప్పుడు కడుపులోకి పోయిన గాలి బుడగలు పోతాయి. అలా చేయకపోతే కడుపులో నొప్పి రావటం, ఉబ్బసంలాంటివి జరిగే అవకాశములు ఉన్నాయి.

ఇంకొకటి ముఖ్యంగా గమనించ తగినది. ఇక్కడ పిల్లలను పుట్టినప్పటినుండి బోర్ల పడుకోపెడతారు. పిల్లలకు ఎక్కువగా వెళ్ళిన ఆహారము బయటకు వచ్చుటకు కడుపులో వున్న గాలి బయటకు పోవుటకు తోడ్పడుతుంది. అంతేకాక, వెల్లకితలా పడుకో పెట్టినప్పుడు పిల్లలు తరుచూ ఉలిక్కిపడే అవకాశం ఉన్నది. ఇవన్నియు కాకుండా బోర్ల పడుకోపెడ్తే పిల్లలు ఎక్కువసేపు నిద్రపోతారు. అందుకనే ఇక్కడ పిల్లలకు బోర్ల పడటం కంటె "తిరగపడుట" ముందుగా వస్తుంది. పుట్టినప్పటినుండి పిల్లలకు, విడిగా "క్రిబ్స్" (పిల్లలను పడుకోపెట్టు ఉయ్యాల వంటిది) లో పడుకోబెడ్తారు. సామాన్యంగా ఎప్పుడూ తల్లి పక్కలో పడుకోపెట్టుకోరు. పెద్దల పక్కలో పడుకోపెట్టుకోవటంవలన పిల్లలకు ఇన్‌ఫెక్షన్ వచ్చే అవకాశం ఉంటుంది అంటారు. పైగా విడిగా పడుకోపెట్టుట వలన స్వశక్తిమీద ఆధారపడు మనస్తత్వం, (Individual Mentality) ధైర్యం అలవడుతాయి. రెండు, మూడు ఏండ్లు వచ్చినప్పటినుండి విడిగా ఇంకొక గదిలో పడుకోపెడ్తారు. అందువలన దడుసుకోవటం, పిరికితనం ఉండదట.

నాకు అన్నిటికంటె వింతగ కనుపించిన విషయం మన దేశంలో పుట్టినది మొదలు రోజూ, రెండు, మూడు బార్లు నీళ్లు పోస్తారు. ఇక్కడ బొడ్డు వూడి, ఎండిపోయే వరకు స్పాంజ్ బాత్ (తడి గుడ్డతో ఒళ్లు తుడవటం లాంటిది) అని చేయిస్తారు. నీళ్లు పోస్తే బొడ్డు సెప్టిక్ అయ్యే అవకాశం ఉందని అంటారు.

పైన రాసినవన్నీ కావాలని అనుకుంటే మనము కూడా అవలంబించవచ్చు. కాని, మనకు అవకాశం లేనివి ఇక్కడ చాలా ఉన్నాయి. ముఖ్యంగా ఇక్కడ పిల్లలకు పెట్టే ఘన పదార్థములు పిల్లలకు మూడు వారాలు వయస్సు వచ్చినప్పటినుండియు పెడ్తారు. మొదట "సీరియల్స్" (ధాన్యానికి సంబంధించినవి) అను వాటితో మొదలు పెడ్తారు. వోట్సు, బియ్యం, బార్లి మొదలైనవన్ని ముందు ఉడికించి పిల్లలకు అరిగే శక్తిని మాత్రం ఉంచి, మళ్ళీ పొడిగా తయారు చేస్తారు. చూడటానికి బట్టలు ఉతుకు సబ్బు పొడిలాగున ఉంటుంది. వేడి పాలు అందులో పోయగానే ఒక లేహ్యంలాగా తయారవుతుంది. దానిని చిన్న చిన్న చెంచాలతో తినిపిస్తారు. మూడు వారములకు సీరియల్స్ లాగానే నాలుగు, ఐదు వారాలకు కూరగాయలు, ఆరు, ఏడు వారాలకు పండ్లు, రసములు ఇస్తారు. కూరలు అన్ని కూడా ముందు మెత్తని గుజ్జులాగా ఉడికించి చిన్న చిన్న సీసాలలో ప్రత్యేకంగా "బేబీ ఫుడ్" అని అమ్ముతారు. వీటన్నిటిలో కూడా అరుగునంత కొవ్వు పదార్థాలను మాత్రం ఉంచుతారు. మూడవ నెలనుండి మాంసము, చికెను, గుడ్లు కూడా పెడ్తారు. మొదట ఐదు, ఆరు నెలలు ఈ బేబీ ఫుడ్స్‌మీద పెంచుతారు. ఆ తరువాత 'జూనియర్ ఫుడ్స్' అని ఉంటాయి. వాటిమీద పెంచుతారు. అవి ముక్కలు, ముక్కలుగా ఉండి బలము ఎక్కువగా ఉంటాయి. ఈ బేబిఫుడ్ తయారు చెయ్య

టావికే ఈ దేశంలో ఐదు, ఆరు కంపెనీలు ఉన్నాయి.

ఇక్కడ కూడా యాభై ఏండ్ల క్రితం ఇప్పుడు మనం చేస్తున్నట్లుగావే పిల్లలకు దగ్గర, దగ్గర సంవత్సరం వయస్సు వచ్చువరకు పాలమీదే పెంచే వారుట. తరువాత పరిశోధనల వలన ముందు మంచి పెట్టవచ్చునని తెలుసుకున్నారుట.

పిల్లలకు ప్రతివెల డాక్టరు పరీక్ష ఉంటుంది. పిల్లలను పరీక్షచేసి డాక్టరు సలహాలను ఇస్తూ ఉంటాడు. చిన్నప్పటినుండి అంటె 2 వ నెల నుండి టీకా ఇంజక్షన్స్ ఇస్తారు. డిఫ్తీరియా, టిటానస్, పోలియో, స్మాల్‌పాక్స్ మొదలైన వన్నీ వరుసగా ఇస్తూ ఉంటారు. అందుకనే సామాన్యంగా ఇక్కడ ఏ పిల్లలకు ఏ జబ్బులూ రావు.

పిల్లలకోసం ఇక్కడ డైపర్సు (Diapers) అని ఒక అర్ధ గజం వెడల్పు ముప్పావుగజం పొడవుతో మెత్తని గుడ్డతో తయారు చేసినవి అమ్ముతారు. అవి మడతలువేసి, పిన్నులతో, పిల్లలకు లంగోటాలలాగా కడ్తారు.

సామాన్యంగా ఇక్కడ ఎవరికి మన దేశంలోలాగా పెద్దవాళ్ళు ఎవరూ దగ్గర ఉండరు మనకు ఏ అనుమానం వచ్చినా పెద్దవాళ్ళను అడిగి సందేహాలు తీర్చుకుంటాము. ఇక్కడ పిల్లల పెంపకం గురించి మంచి పుస్తకాలు ఉంటాయి. అవి చదివి నేర్చుకుంటారు. పిల్లలువున్న ఏ అమెరికను కుటుంబంలో చూసినా సరే! ఆ పుస్తకం కనుపిస్తుంది.

తల్లిని విడిచిపెట్టి పిల్లలు ఉండటం తల్లికి, పిల్లలకు కూడా ముఖ్యం అంటారు. అప్పుడప్పుడు పార్టీలు మొదలైనవాటికి వెళ్ళినప్పుడు పిల్లలను ఎవరికైనా అప్పచెప్పి వెడ్తారు. వారికోసం 'బేబి సిట్టర్స్' అని నియమించుకోవచ్చు. మనం తిరిగి వచ్చేవరకు పిల్లలను చాలా జాగ్రత్తగా చూస్తారు. పది మంది మధ్య క్రొత్త ప్రదేశములో పిల్లలను తీసుకువెళ్ళి మిగతా వాళ్ళకు చిరాకు కలిగించరు. పిల్లలకు కూడా సరిగిపోయే అవకాశం ఉండదు. పైగా తల్లిని విడిచిపెట్టి ఉండే అలవాటు ఏర్పడుతుంది. ముసలివాళ్ళు, హైస్కూలులో చదివే పిల్లలు "బేబి సిట్" చేసి డబ్బు గడిస్తారు.

ఐదు ఆరు ఏండ్లు వచ్చిన పిల్లకు తండ్రి కొంత 'పాకెట్‌మనీ' అని ఇస్తారు. అంతేగాక ఇంట్లో ఎక్కువ పని చేసినందుకు విడిగా డబ్బు ఇస్తారు. ఇలా డబ్బు జాగ్రత్తచేసి, క్రిస్టమస్, పుట్టిన రోజు పండుగలకు, తల్లి తండ్రులకు, స్నేహితులకు బహుమతులు ఇస్తూ ఉంటారు. మామూలుగా ప్రతి కుర్రాడు తన స్కూల్ తరువాత మిగిలిన కాలంలో చిన్న చిన్న ఉద్యోగములు చేస్తూ ఉంటారు. పేపర్లు ఇవ్వడం, బేబి సిట్ చెయ్యడం లాంటివిచేస్తూఉంటారు. మామూలుగాహైస్కూల్ చదువు తరువాత తండ్రి చదువు చెప్పించటం అనేది ఎక్కడోగాని ఉండదు. కొంత టైము ఉద్యోగం చేస్తూ, కొంత టైము చదువుకుంటారు. పదహారు, పద్దెనిమిది సంవత్సరాలు వచ్చిన ఏ కుర్రవాడూ సాధారణంగా తండ్రిమీద ఆధారపడడు. ★

# వనితా వాణి

## స్త్రీ

వనితాలోకంలో రమగారు వ్రాసిన "స్త్రీ" వ్యాసం చదివిన తరువాత ఈ విమర్శ రాయాలనిపించింది. వ్యాసం చదవడాన్కి బాగానే ఉంది కథలా అందులో కొంత సత్యం లేకపోలేదూ. కానీ, అసభ్యత్వం గోచరిస్తోంది. ఎవరో ఒకరిద్దరి జీవితాలను ఆదర్శంగా యిలాంటి వ్యాసాలు వ్రాస్తే అంత బాగుండదని నా అభిప్రాయం. ఎందుచేతనంటే ప్రస్తుత కాలం ఆడపిల్లల జీవితాలు తీరని సమస్యలుగా లేనే లేవు. ఏ ఒక రిద్దరికో తప్ప. అయ్యో ఆడపిల్లా అంటారు ఆమెను ఎవరూ రమ్మని కోరలేదు. ఈ లోకానికి అని వ్రాశారు. స్త్రీ లేనిదే సృష్టి ఎట్లగునో అని ఆలోచించేవారెవరికీ యిలా అనడాన్కి నోరు రాదు. ఆమె వ్రాసిన విధంగా ప్రస్తుత పరిస్థితులలో వివాహం ఒక సమస్యే కావచ్చు. కానీ ప్రస్తుతం వివాహం చేయలేని తలిదండ్రులు తమ కుమార్తెలకు విద్య నేర్పించి ఉద్యోగాలకు పంపుచున్నారు. వివాహిత అయిన స్త్రీ కూడా ఇప్పుడు చాల సుఖముగా జీవించుచున్నది. పూర్వం అయితే అత్త, ఆడబడుచుల బాధలుండెడివి. కాని ఉద్యోగరీత్యా కాని, కన్నవారేని కూడ తలంచక పురుషుడు వివాహానంతరం భార్యతో వేరే కాపురం చేస్తున్నట్లు అందరికీ తెలిసినదే. 'రమ' గారు వ్రాసిన వ్యాసం 10 సంవత్సరముల క్రితం పరిస్థితిని వ్యక్తం చేస్తున్నది. ఇంకా ఇలా రాస్తుంటే ఇది విమర్శగా గాక వ్యాసంగా తయారవుతుందని ముగిస్తున్నాను.

వి. వి. రమణ (మద్రాసు)

* * *

రచయిత్రి రమగారు స్త్రీ వ్యాసం చాల బాగుగా వ్రాసిరి. ఆడపిల్ల పుట్టటంతోటే తిట్లు దీవెనలు అందుకుంటూ భూమిమీద పడుతుంది. ఇహ అక్కడినుంచి ఒక్కొక్క దశ ఒక్కొక్క నరకంలా ఉంటుంది. చిన్నతనంలో ఏమన్నా తెలిసీ తెలీనితనం కాబట్టి బాధ తెలీదు. ఇహ రెండవ దశలో తనవారు తనని ఎంత నీచంగా చూస్తున్నారో అర్థమవుతుంది. తనకన్నా పెద్దవాళ్లయిన అన్నయ్యలు అనటం సరే. చిన్నవాళ్లయిన తమ్ముళ్లు కూడా తనేమన్నా నీ కెందుకు పోవే అంటారు. ఒకవేళ తనేమన్నా ఎదిరించి మాట్లాడినా ఆడదానికి అంత అహంకారం పనికి రాదే అంటారు అన్నయ్యలు ఇహ పెళ్లి వయసు వచ్చేటప్పటికి ఈ అమ్మాయి జాతకం మంచిదయి ఉండి, త్వరగా పెళ్లి అయితే సరిలేకపోతే ఇహ ఆ అమ్మాయి అవస్థ భగవంతుడికే తెలియాలి. కన్న తల్లితండ్రే తనని చూసి చీదరించుకుంటారు. అన్నయ్యలు, వదినలూ అనటం చెప్ప నవసరంలే. వదినల ముందరే అన్నయ్యలు దీని ముఖం చూసి ఎవరు చేసుకుంటారు. దురదృష్టవశాత్తు యీ ఇంట్లో పుట్టింది కాని అంటారు. తమ్ముళ్లయితే ఎప్పుడన్నా వాకిట్లోకి వస్తే ఇంట్లోకి పోవే యీ స్నేహితు లెవరైనా చూస్తే ఎగతాళి అంటారు. పెళ్లి అయితే అదీ మరీదరక ఎప్పుడన్నా సినిమాకు వెళతానండీ అంటే మీ కెందుకే ఆడవాళ్లకు సినిమాలు అనే భర్తలు కూడా ఉన్నారు. స్త్రీ ఎంత పైకి రావాలనుకున్నా పురుషుడెప్పుడు స్త్రీని అణిచేస్తున్నాడు. స్త్రీలను నీచంగా చూచే పురుషులు ఈ వ్యాసం చూచైనా మారతారని ఆశిస్తాను. తరచూ ఇటువంటి వ్యాసాలనే మా వనితలకు అందజేయాలని కోరుతున్నాను. ఈ వ్యాసాన్ని అందజేసిన మీ పత్రికకు రచయిత్రికి నా ధన్యవాదాలు

గుంటూరు సుగుణ (కావలి)

## శర్కరాయణం

మొత్తంమీద ఈ వ్యాసం వనితావాణిలో వేయడం బాగానే ఉంది. హాస్య పంచిక గనుక అది ఒక హాస్యమే అనుకున్నాం. లతికగారికి మా అభివందనములు.

సరస అండ్ సరస (గుంటూరు)

---

## శ్రీవారి తతంగం

మా సచిత్ర వారపత్రికలో ఎస్. అనసూయగారు శ్రీవారి తత్వము తెలుసుకోవడము ఎలా ? అనే శీర్షిక బాగానే యున్నది. ఇలాంటి చిట్కాలు వ్రాసి భారత నారీలోకములో యువ మహిళలకు కన్ను తెరిపించారు. ఇంకా మరికొన్ని చిట్కాలు మీకు తెలిసియున్నట్లయితే వచ్చే పత్రికలో వ్రాసి మమ్ములను సంతోష పర్చగలందులకు నా ధన్యవాదాలు అర్పించుచున్నాను.

సాలూరు రాజేశ్వరిదేవి (భోరుభద్ర)

* * *

శ్రీ వారి తత్వం తెలుసుకోడం ఎలా ? అంటూ శ్రీమతి అనసూయ గారిచ్చిన చిట్కాలు ముందుగా మావారే చదివారు. పైగా ఇవన్నీ అద్దంలో ప్రాక్టీసు చెయ్యనా ? నీకూ నాకూ కూడా పని కొస్తా యేమో నన్నారు. మొత్తం మీద 'హ్యూమరస్‌గా' ఉంది.

శ్రీమతి కుసుమకుమార్ (బెనారస్)

* * *

ఎస్. అనసూయగారి వ్యాసం సరదాగానే ఉంది. గాని నమ్మదగ్గదిగా లేదేమో ననిపిస్తోంది. ఏదిఏమైనా ఇంటిల్లిపాది చదివి ఆనందించాం.

సుభద్రారామన్ (వాల్తేరు) ★

వంటలు

## సుండలు

తెలుగులో వీటిని తాలింపువేసిన గుగ్గిళ్లు అంటారు. బటానీల తోటి గానీ, పెసల తోటిగానీ ఇవి చేస్తారు.

| | |
|---|---|
| పెసలు | ½ అరాకు |
| కరివేపాకు | కొద్దిగా |
| పప్పునూనె | 2 చెంచాలు |
| కొబ్బరి ముక్కలు | కాసిని |
| మిరపకాయలు | రెండు, మూడు |
| ఆవాలు | ½ చెంచా |
| మినప్పప్పు | ఓ చెంచాడు |
| ఇంగువ | కొద్దిగా |
| నీళ్లు | కప్పున్నర |
| ఉప్పు | ఓ అరచెంచాడు |

పెసలు శుభ్రంగా కడిగి ఓ కప్పున్నర నీటిలో ఓ అరచెంచాడు ఉప్పు వేసి ఆ నీటిలో పెసలను బాగా మెత్తబడేటట్లు ఉడకబెట్టాలి. తర్వాత నీటిని బాగా వొంచెయ్యాలి. ఓ పొయ్యిమీద వేపుటకుపయోగించే గిన్నెలో కాస్త నూనెవేసి కాచాలి. అందులో కొన్ని ఆవాలు మినప్పప్పు, మిరపకాయలు ముక్కలు వేసి, అవి కాస్త గోధుమరంగుకు తిరిగేదాకా వేయించాలి. ఈ వండిన పెసలు ఆ నూనెలో వేసి ఓ ఐదు నిమిషాలపాటు వేయించి అందులో కాస్త కరివేపాకు, ఇంగువ, కొబ్బరిముక్కలు, నిమ్మకాయరసం వేసి బాగా కలపాలి. ఇది వేడిగా వున్నప్పుడు తింటేనే బాగుంటుంది. ఈ సుండలు (గుగ్గిళ్లు) చేసేందుకు బటానీలు, సెనగలు, వేరుసెనగ (పచ్చివి) పెద్దచిక్కుళ్లు కూడా వాడుకోవచ్చు. ★

## చదువలావ - బి. వి. సత్యమూర్తి



# మెరకచేను

## తాళ్లూరు నాగేశ్వరరావు



"మెరకచేను బేరం ఇచ్చేశాను" అన్నాడు రామసుబ్బయ్య అప్పుడే బజార్నుంచివొచ్చి, నేరుగా పెరట్లో రాతి గోళెం దగ్గరకు వెళ్ళి-కాళ్లూ చేతులూ కడుక్కొంటూ.

వంట గదిలో పీట వాల్చి, రాగి చెంబుతో మంచి నీళ్లు పెడుతూన్న భార్య లక్ష్మీకాంతమ్మ ఆ మాటలు విన్నది. కాని వెంటనే వ్యాఖ్యానం విసర లేదు.

జామచెట్టు కొమ్మకు తగిలించియున్న తుండు గుడ్డతో కాళ్లూ, చేతులూ తుడుచుకొని—వంట గది వసారా ముందు నిలబడి భార్యకేసి పరిశీల నగా చూశాడు. తెల్ల సిల్వర్ పళ్లెంలో అన్నం పెట్టి, జాడీలోంచి ఎఱ్ఱ కారపు పచ్చడి తీసి పళ్లెంలో వేసి, చిన్న పుట్టగిన్నెలో దోసకాయ తోడు కూర పెట్టి, నేతిగిన్నె ప్రక్కనుంచి భర్త కేసి చూసింది లక్ష్మీకాంతమ్మ.

ఆయన పీటమీద మునిగాళ్లమీద కూర్చుంటూ —"మెరకచేను బేరం ఇచ్చేశాను" అన్నాడు నేరం చేసినంత భయంగా.

ఆవిడ మూతి వంకాయ తొడిమెలా పెట్టి 'ఎవరికి ?" అన్నది.

"వెంకటకృష్ణయ్యకు—"

"మరెవరి కిస్తావులే ? అన్నాట్టు కనుబొమలు ఎగురవేసి. ఎంతకు?" అన్నది.

"పదకొండు వేలకు" అన్నాడు రామసుబ్బయ్య తల వంచుకుని తెల్లటి అన్నపు మెతుకుల్లో ఎఱ్ఱటి పచ్చడి కలుపుకుంటూ.

లక్ష్మీకాంతమ్మ మొహంపై ఆశ్చర్యం గాలికి తెరచాపవలె రెపరెప లాడింది.

"బంగారంలాంటి రెండెకరాల మెరకచేను పద కొండు వేలేనా ? వెంకటకృష్ణయ్య ఎంత స్నేహితుడైతే మటుకు పొలం అంత చవగ్గా యిచ్చుకుంటారా ? అబ్బాయి చదువుకు అవసరమై మనం పొలం అమ్మజూపడ మేమిటి ? కుళ్లి పోయిన కూరగాయలకు మల్లే తక్కువకు బేర మివ్వడ మేమిటి ? డబ్బు ముందు స్నేహాలూ, బంధుత్వాలూ చూసుకుంటే—వ్యవహారం వెల్లకిలా బడ్డట్టే !"

"అంత తేలిగ్గా మాట్లాడకు. డబ్బుమీద నీకంటే నాకు తక్కువ అపేక్షేమీ లేదు. అసలు నాకా మెరకచేను అమ్మటమంటేనే—ప్రాణం ఎగిరిపోతున్నట్టుంది. ఏం చేస్తాం ? తప్పనిసరి అవుతూన్నది. ఈ రెండేళ్లూ అబ్బాయికి చదువు చెప్పించామంటే—డాక్టరీ ప్యాసై, ఆ తర్వాత వాడే మనల్ని సుఖపెడతాడు. ఏమైనా ఇప్పుడు అర్జంట రంగా పొలం అవ్వాలంటే—ధర ఎట్లా పలుకు తుంది ? అవసరాన్నిబట్టి కొనేవాడికి అమ్మేవాడు లోకువే. వెంకటకృష్ణయ్యకు చేనులో చేను కలు స్తుంది కాబట్టి ఆపాటి ధర పెట్టాడు."

"పూరి మొత్తానికి మన మెరకచేను గైరు. నిరుడు అందరి చేలూ వాన దెబ్బకు తాలూ తప్పా వేసి సగానికి సగం కూడా పండకుండా పోయినా మన మెరకచేను ఎకరానికి ఇరవై బస్తాలకాడికి రాలింది. నిక్షేపంలాంటి ఆ మాగాణి ఎకరం అంబదున్నర వేలండీ—ఎవ్వరైనా నవ్విపోతారు.

అమ్ముకోవడం చేతకాకపోతే సరి. మొన్న అంకయ్యగారి సూరయ్య అడవి పొలమే అయిదువేలు చేసి అమ్మలేదూ! ఆ లెక్కన మన పొలం ఎకరం ఏడువేలు చేస్తుంది."

"ఏడువేలేం ఖర్మ, పదివేలు చేస్తుంది—కొనే నాథుడే ఉంటే!" ఎగతాళిగా అన్నాడు రామసుబ్బయ్య ఎర్ర కారపు పచ్చడి కారం నాలుకపై కరకర లాడగా.

"అయితే మెరకచేను మొత్తం మూడు వేలకే అమ్మేసేయండి. నాకెందు కొచ్చింది?" కోపంతో ముక్కు, పెదాలు గజగజ లాడగా—మజ్జిగ తపేళా ముందు పెట్టి, వంటగది యివతల కొచ్చింది లక్ష్మీకాంతమ్మ.

మజ్జిగ పోసుకోకుండానే—పీటమీదనుంచి లేచాడు రామసుబ్బయ్య.

"రామసుబ్బయ్యా!" ఇంటిముందు వసారాలోంచి కేక వినబడింది.

రామసుబ్బయ్య ఇంట్లోంచి వసారాలోకి వచ్చాడు. పెద్ద అరుగుమీద షావుకారు చంద్రశేఖరమూ, ఆయన నమ్మినబంటు గణపతీ కూర్చున్నారు. ఎందుకో రామసుబ్బయ్య మనస్సు వాళ్లను చూడగానే కళుక్కుమన్నది. వాళ్లకేసి తేరపార జూసి, ప్రక్క జేబులోంచి పొగాకు కాడ తీసి—పాయలుతీయ నారంభించాడు.

"మెరకచేను అమ్మజూపావంటగా" అన్నాడు గణపతి గంభీరమైన మీసాల్లోంచి దోరగా నవ్వుతూ.

"బేరం ఇచ్చేశాను" ముక్తసరిగా అన్నాడు రామసుబ్బయ్య.

"బయానా తీసుకోలేదుగా."

రామసుబ్బయ్య మాట్లాడలేదు. గడపమీద కూర్చుని చుట్ట చుట్టుకో మొదలెట్టాడు.

షావుకారూ, గణపతీ ఒకళ్ల ముఖాలకేసి ఒకళ్లు చూసుకున్నారు.

రోహిణి కార్తె ఎండ పదకొండు గంటలకే శౌఖ చూపిస్తోంది.

లక్ష్మీకాంతమ్మ వంటగదిలోని ఎంగిళ్లు తీసివేసి, పైటచెంగుకు చేయి తుడుచుకుంటూ వచ్చి, మండిగం ప్రక్కనే నిలబడింది.

"మెరకచేను మొత్తం పదిహేను వేలకు తీసుకుంటామంటున్నారు షావుకారుగారు. మీ కిష్టమైతే ఈ మాసంలోనే రిజిష్టరు కూడా చేసుకోవచ్చు." అన్నాడు గణపతి బీడీ వెలిగిస్తూ.

షావుకారు చంద్రశేఖరంగారు అవునన్నట్టు పొడిదగ్గు దగ్గారు.

లక్ష్మీకాంతమ్మ మనస్సు సంతోషాతిశయంతో నీళ్లు నిండిన చెరువైంది.

కాని, రామసుబ్బయ్య ముఖం నిప్పు సెగ తగిలిన పచ్చని చెట్టు వగిది కమిలిపోయింది.

"బేరం ఖరారైంది. ఇప్పుడు మాట తప్పలేను." రవ్వంత బెసక్కుండా అన్నాడు రామసుబ్బయ్య.

"బేరంలో బయానా పుచ్చుకుంటేనే ఖరారైనట్టు. మాటల్ని ఏ క్షణంలోనైనా మార్చుకోవచ్చు." అన్నాడు గణపతి.

"ఆయన మాటలకేంలే అన్నయ్యగారూ! సంపాయించేది లేకపోయినా, ఉన్నది వూడ్చుకోవటమే చాతనవును. నాలుగువేల రూపాయలు ఎక్కువ వస్తుంటే ఎవ్వరైనా వాలిసే పోగొట్టుకుంటారా? ఆ మెరకచేను మీరే తీసుకోండి—పదిహేను వేలకు" అన్నది లక్ష్మీకాంతమ్మ కల్పించుకొని.

తోక త్రొక్కిన త్రాచులా భార్యకేసి చూశాడు రామసుబ్బయ్య.

లక్ష్మీకాంతమ్మ జంకలేదు.

"వ్యవహార సరళిలో మాట్లాడా నమ్మాయీ! డబ్బు విలువ మగవాళ్లకంటె ఆడవాళ్లకే ఎక్కువ తెలుసు. బయానా ఇవ్వమంటావా, ఓ వెయ్యి రూపాయలు రామసుబ్బయ్యా!" అన్నాడు గణపతి లౌక్యంగా.

"ఊళ్లో నా పరువు ప్రతిష్ఠల్ని మొదలంటా తీసేసేట్టున్నారు. పొలం ఒకళ్లకు బేరం యిచ్చి—ఎక్కువ ధర వొస్తుంది గనుక, మీకు అమ్మమంటారా? ఎంత అన్యాయం? వూళ్లో నలుగురూ నా మొఖాన ఉమ్మెయ్యరూ! నేనూ చీమూ, నెత్తురూ గలవాడ్నే." అన్నాడు రామసుబ్బయ్య రోషంగా.

ఆ మాటలు షావుకారు గారికి కోపకారణాలయ్యాయి. చివుక్కున లేచి "ఆలోచించుకో" అని బయటకు నడిచాడు. తల ఆడిస్తూ గణపతి కూడా అనుసరించాడు.

మండిగం ఇవతలకొచ్చి, లక్ష్మీకాంతమ్మ భర్తపై మట్టిఅడుసు విరుచుకుపడ్డట్టు విరుచుకుపడింది.

"మీలాంటి మొండి మనుషుల్ని నే నెక్కడా చూడలేదు. లోకంలో ఎవరైనా డబ్బు వొస్తుంటే—మోకాలు అడ్డు పెడతారా? ఎంత విడ్డూరం? మీ హయాములో దమ్మిడీ సంపాయించలేదు. పైపెచ్చు పిత్రార్జితం అమ్ముకుంటూ రావటమే! మెరకచేనుకు పదిహేనువేలొస్తే—నాలుగైదు వేలు అబ్బాయి చదువుకు ఖర్చయినా, రెండెకరాల గరువు కొనుక్కోవచ్చు. ఆమాత్రం ముందు చూపు మీకెట్లా లేకపోయింది. అసలు నన్ను అడక్కుండా పున పున బేర మెందు కిచ్చారు? ఇస్తే మటుకు మాటకు కట్టుబడి ఉండాలనేదేముంది? దేశంలో ఎన్ని బేరాలు మాటల్లోనే తప్పిపోవటంలేదు. మీరేమైనా కలియుగ సత్య హరిశ్చంద్రులా! ఆ మెరకచేను షావుకారుగారికే అమ్మండి. లేకపోతే నేను బావిలో దూకి చస్తాను."

* * *

షావుకారు చంద్రశేఖరమూ, ఆయన ఉప్పు తింటూ రొమ్ము విరుచుకు తిరిగే గణపతీ, రామసుబ్బయ్య ఇంటికి వెళ్లి—మెరకచేనుకు ధర పెంచినట్లు ఆరోజు మధ్యాహ్నమే వెంకటకృష్ణయ్యకు తెలిసింది. షావుకారు స్వభావానికి యిష్టపడ్డాడు.

సూర్యుడు అటు వాలాక, కోటినాగులు కాళ్లొనా వద్ద కనపడ్డ రామసుబ్బయ్యను ప్రక్కకు పిల్చి, మెరకచేను విషయం ఎత్తాడు వెంకటకృష్ణయ్య.

మనస్సులోని బాధనంతా బయటపెడుతూ జరిగిన సంగతంతా చెప్పాడు రామసుబ్బయ్య. ఆమీదట వెంకటకృష్ణయ్య "షావుకారు చంద్రశేఖరం బుద్ధి మనకు తెలియనిది కాదు. ప్రతి బేరంలోనూ తలదూర్చి, వ్యవహారాన్ని చెడగొట్టడం తప్పుదోవ పట్టించడం—ఆయనకు సరదా. ఆ పాడు బుద్ధి ఉండబట్టే, లక్షాధికారియైనా వూళ్లో చిన్న మెత్తు విలువ లేదు, అయినా అవతల నీకు నాలుగువేలు లాభం వస్తుంటే, నేను పట్టు పట్టటం దేనికి? షావుకారుకే అమ్ము మెరకచేను. పదిహేను వేలంటే—మంచి ధరే. అంత మొత్తంతో నేను కొనలేను" అన్నాడు.

షావుకారు తన ఇంటికి వచ్చి, ధర పెంచడంతో ఆరంభమైన ఆత్మసంఘర్షణ రామసుబ్బయ్యలో ఆరని చిచ్చుకు మల్లే పొగల్ని చిమ్ముతూనే ఉంది. వెంకటకృష్ణయ్య చిన్ననాటి మంచి స్నేహితుడు. ఇద్దరూ ఒక జట్టుగా గోటికాయలాడేవాళ్లు, కాలువలో ఈతగొట్టేవాళ్లు, బీడులో పశువుల్ని తోలుకెళ్లి మేపేవాళ్లు, చెడుగుడు ఆడేవాళ్లు, నాటకాలు వేసేవాళ్లు. పెద్దవాళ్లు అయినాక కూడా ఎంతో కలిసి మెలిసి ఉండేవాళ్లు, ఒకళ్ల కొకళ్లు అప్పులిచ్చుకుంటూ, తీర్చుకునేవాళ్లు. పొలంపనుల్లో పాయితాలు చేసుకొనేవాళ్లు. ఎంతో స్నేహంగా, ఆప్యాయంగా, పూర్వానుబంధంగా, ఒక తండ్రి బిడ్డల్లాగా ఉంటూ ఉండేవాళ్లు. అట్లాంటి ఆత్మీయత ఇద్దరిమధ్యా స్పష్టమైన రూపాన్ని ధరించాక—ఇచ్చిన మాట తిసికోవడ మెట్లా? పైగా వెంకటకృష్ణయ్యకు చేనులో చేను. ఆ ధరకు తను ఒప్పుకున్నాడు. బయానా ఇస్తానన్నా—తను తీసుకోలేదు. 'మన మధ్య కూడా బయానా ఏమిటి? మనుషుల్లో అప్పుడే నమ్మకాలు జారిపోతున్నాయా?' అన్నాడు తను. ఆ మాటల్నీ, స్నేహాన్నీ, ఆత్మీయతనూ—వెధవది డబ్బు ముందు మర్చిపోయి, నీచంగా, స్వార్థంగా, నగుబాటుగా ఎట్లా ప్రవర్తించటం? 'ఆడి తప్పాడు', 'నిలకడలేని మనిషి', 'హెచ్చు ధర కోసం పాలువూలాడు' అనుకుంటారు. భార్య సలహా వింటే ఆవిడకు దడిస్తే — ఊళ్లో తనకు గడ్డిపోచ పాటి చెల్లుబడి కూడా ఉండదు ...... రామసుబ్బయ్య తీవ్రంగా ఆలోచించుకున్నాడు.

"వెంకటకృష్ణయ్యా నేను హెచ్చు ధరకోసం ప్రాకులాడేవాడ్ని కాదు. నీకు మాట యిచ్చి తప్పుకుంటానా? మా ఆడది ఏడ్చి ఏడు రోజులు ఉపవాసమున్నా—మెరకచేను నీకే యిస్తాను" అన్నాడు రామసుబ్బయ్య గుండెపట్టు నిలదొక్కుకుని.

వెంకటకృష్ణయ్య మిత్రునికేసి పరకాయించి చూశాడు. ఆయన గుండె ధైర్యాన్ని, ముఖపు తీరునూ, స్నేహం కోసం వేటసి ఖాతరుచేయని తత్వాన్నీ గ్రహించాడు.

"ఈ బేరం మూలకంగా మీ కుటుంబంలో భేదాభిప్రాయాల్నీ, అలజడినీ, పోట్లాటల్నీ, ఏడ్పులనూ నేను సహించను రామసుబ్బయ్యా! నువ్వు మెతక మనిషివి కావని నాకు తెలుసు. కాని ముక్కుకు సూటిగా, మూర్ఖంగా ప్రవర్తించటంవల్ల వ్యవహారాల్లో చిక్కు లేర్పడతాయి. తద్వారా సంసారంలో అశాంతి రేకెత్తడం శ్రేయస్కరం కాదు. సముద్రపుటలకు తల వంచడం వల్ల మేలు. నిటారుగా నిలబడితే ముఖానికి దెబ్బ తగలక మానదు. అట్లాగే పరిస్థితులకు తల యొగ్గడం సముచితం. కుటుంబంలో తాత్కాలికంగా ప్రమాదాల నుంచి బయటపడొచ్చు. మనలో బలహీనత లేకపోయినా, ఇతర్ల బలహీనత ప్రభావాల్ని మన్నించక తప్పదు. నువ్వు షావుకారుకు పొలం అమ్మినా—నేను బాధపడను. నిన్ను గురించి

36 వ పేజీ చూడండి



# కొలంబా

## రచన: ప్రాస్పర్ మెరిమె

**జరిగిన కథ**

కర్నల్ థామస్ నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్ వస్తాడు. లిడియా సాహసం గల యువతి. చిత్రలేఖనం తెలుసు. 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం. అక్కడికి వెళ్లడం కష్టనష్టాలతో కూడినదని ఐనా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాతెతో ప్రయాణం అవుతారు. కార్సికాకు బయలుదేరారు. వారితో లెఫ్టినెంట్ "ఆర్సో దెల్లా రెబ్బియా" అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను యీ రెబ్బియాతో పరిచయం పెరుగుతుంది. మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది. వారు కార్సికా చేరారు. పాస్‌పోర్టు ఆఫీసరు మాటలవల్ల, ఆర్సో తండ్రి హత్యకు లోనయ్యాడని మిస్ లిడియా గ్రహిస్తుంది. ఇంతలో ఆర్సో చెల్లెలు కొలంబా అతన్ని వెతుక్కుంటూ అజాచ్చియోకి వస్తుంది. కర్నల్‌గారి సత్రంలోనే దిగుతుంది. కొలంబా, ఆర్సో ఆంటన్‌లు పియత్రనెరాకి వెళ్ళిపోతారు. స్వగ్రామంలో కొలంబా బ్రాందొలాచ్చియో అనే బందిపోటు దొంగకు సహాయం చేస్తున్నట్లు ఆర్సో ఆంటన్ తెలుసుకుంటాడు.

## 11

కొలంబా బారిసినీ పేరు ఉచ్చరించకుండా కొన్ని రోజులు గడిచాయి. తన అన్న చెప్పిన పాఠాలు నేర్చుకుంటూ మిస్ నెవిల్ గురించి ఎక్కువగా మాట్లాడేది. ఆర్సో, ఆమె చేత ఫ్రెంచి ఇటాలియన్ పుస్తకాలు చదివించేవాడు. అంతకు ముందు ఎంత చదువు లేనిదిగా కనిపించేదో ఇప్పుడు అంత విచక్షణ చూపించటం గమనించి ఆశ్చర్యపోయేవాడు ఆర్సో.

ఒకరోజు పొద్దున, భోజనం ముగిసిన తర్వాత పాఠం పుస్తకం, కాగితాలతో తయారు కావటానికి బదులు తలమీద 'మెజారో' ధరించి వచ్చింది. గంభీరంగా అన్నది: "అన్నయ్యా నాతో ఒకసారి బయటి రావాలి!"

"ఎక్కడికి వెళదాం?" అంటూ ఆర్సో ఆమె రెక్కపుచ్చుకున్నాడు.

"నీ చేదోడు అవసరం లేదు అన్నయ్యా! కాని నీ తుపాకి అవసరం. నిరాయుధులుగా వెళ్లడం ప్రమాదకరం."

"ఇంత పెందరాళే! పోనిలే, ఎక్కడ పద్ధతి నక్కడ అవలంబిద్దాం. ఇప్పు డెక్కడికి?"

కొలంబా సమాధానం ఇవ్వలేదు. తలమీద మెజారో సరిచేసుకొని బయట కాపలా కాసే కుక్కను పిలిచి అన్నతో బాటు బయలుదేరింది. పెద్ద అంగలతో గ్రామం పొలిమేరకు తీసుకు వెళ్ళింది. అక్కడ ఒక చిన్న బాటలోకి దారి తీసింది. ఇది అక్కడ వేసిన ద్రాక్ష తీగల మధ్య వంకర టింకరగా ఎక్కడికో తీసుకుపోయేట్లు ఉంది. కుక్కకి ఏదో చెప్పగా అది నేల వాసన చూసుకుంటూ ముందుకు పోయింది. వారు వెనకబడిపోతే తోక ఆడిస్తూ వారికోసం ఆగేది. దాని కర్తవ్యం దానికి బాగా అర్థం అయినట్లు ఉంది.

"ముషెత్తో (కుక్క పేరు అ॥) మొరగడం మొదలు పెట్టగానే నీ తుపాకితో సిద్ధంగా ఉండు అన్నయ్యా! కదలకుండా అక్కడే నుంచో" అంది కొలంబా.

కొంతసేపు ఇంకా ముందుకి సాగిపోయారు. ఊరికి అర మైలు ఉందనగా బాటలో ఒక మలుపు కనిపించిన చోట ఆగింది కొలంబా. అక్కడ ఒక చిన్న పచ్చనిపొద కనిపించింది. ఇది మూడు అడుగుల ఎత్తు పెరిగింది. గోపురం ఆకారం వచ్చేట్లు కొమ్మలు, ఆకులు కత్తిరించినట్లు ఉంది! శిఖరం మీద ఒక నల్లని 'క్రాస్' ఉంది. ఎవరయినా బలవంతమరణం పొందినచోట ఇటువంటిది ఏర్పాటు చెయ్యటం కార్సికాలో పురాతన కాలాలనుంచి

వస్తున్న అలవాటు అది చనిపోయిన వారి జ్ఞాపకార్థం దినం దినం పెరుగుతున్న చిహ్నంగా ఉంటుంది వీటిని మరణించిన 'ముచ్చియో'ల 'ఆమాస్' లంటారు.

కొలంబా దానిముందు ఆగింది. పక్క చెట్టు రెమ్మ ఒకటి విరిచి దానికి గుచ్చింది "ఆర్సో"అంది "మనతండ్రి మరణించిన చోటు ఇదే ఆయన ఆత్మ శాంతికోసం ప్రార్థిద్దాం" అని అక్కడే మోకరిల్లింది ఆర్సో ఆమెని అనుసరించాడు ఆ క్షణంలో ఊరిలో చర్చిగంట నెమ్మదిగా మోగింది. క్రితం రాత్రి ఎవరో వ్యక్తి మరణించారు. ఆర్సోకి కన్నీరు ఆగలేదు

కొన్ని నిముషాల తర్వాత కొలంబా లేచింది. కళ్లు పొడిగానే వున్నాయికాని ముఖంలో ఆవేశం కనిపిస్తోంది. కార్సికాలో క్రిస్టియన్‌లు 'క్రాస్'సంజ్ఞ ఒకవిధంగా చేస్తారు బొటనవేలు ఉపయోగించి అటువంటి సంజ్ఞ చేసి అన్నగారితో తిరిగి గ్రామానికి వెళ్లిపోయింది మవునంగా తమ ఇల్లు ప్రవేశించారు ఇద్దరూ. ఆర్సో తనగదిలోకి వెళ్ళిపోయాడు ఒకక్షణం తర్వాత, కొలంబా కూడా ఒక చిన్న పేటిక పట్టుకుని అతన్ని అనుసరించింది దానిని తెరిచి ఒక చొక్కా బయటికి తీసింది దాని మీద పెద్ద పెద్ద నెత్తురుమరకలు కనిపిస్తున్నాయి "ఇదిగో నీ తండ్రి చొక్కా ఆర్సో!" దానిని అతనిమీదకి పడవేసింది "ఇదిగో ఆయన్ని చంపిన తుపాకీ గుళ్లు!" అని రెండు కిలుము పట్టిన తుపాకీగుళ్లు పడవేసింది "ఆర్సో! అన్నయ్యా, నువ్వు ఆయన హత్యకి పగతీర్చాలి" అని అతన్ని గట్టిగా కావలించుకుంది చొక్కా, తుపాకీగుళ్ళు తీసుకుని వాటిని ఆవేశంతో ముద్దుపెట్టుకుంది హఠాత్తుగా అగది వదలి వెళ్ళిపోయింది. ఆర్సో కరుడు గట్టుకుపోయినట్లు కూర్చుని వుండిపోయాడు తన కుర్చీలో

హత్యని జ్ఞాపకం చేసే ఆ చొక్కాని, తుపాకీ గుళ్లని ముట్టుకునే ధైర్యం లేకపోయింది. అతనికి కొంతసేపు. చివరికి అతి ప్రయత్నంతో వాటిని తీసి మళ్లీ ఆ పేటికలో పెట్టివేశాడు. లేచి వెళ్లి మంచంమీద పడిపోయాడు. గోడ వైపు తిరిగి ముఖం దిండులో దాచుకున్నాడు. దెయ్యం చూసి దడుచుకున్న వానివలే. తన చెల్లెలి చివరి మాటలు ఇంకా చెవిలో మోగు

45 వ పేజీ చూడండి

వివిధ ప్రాంతాల వింతలు 23

# పేరుకు తగ్గ దార్-ఎస్-సలాం

సాధారణంగా ప్రపంచంలో పేరుకు అనుగుణంగా ఉండే వస్తువులు, వ్యక్తులు చాలా అరుదు అలాంటి అరుదైన బిరుదు గల నగరాల్లో ఒకటి దార్—ఎస్—సలామ్ దార్—ఎస్—సలాం అంటే 'శాంతి కేంద్రం' పేరుకు తగ్గ నగరం ప్రపంచంలో చాలా దేశాల నుంచి జనం వస్తూ ఉంటారు ఈ నగరానికి

టాంగనీకాకు రాజధాని నగరమైన ఈ దార్—ఎస్—సలామ్, జర్మనీవాళ్లు ఈదేశం ఆక్రమించిన రోజుల్లో ఓ చిన్న పల్లెగా ఉండేది వాళ్లు దీని అధీనంలోకి తీసుకని 1891 లో జర్మన్ తూర్పు ఆఫ్రికా ప్రాంతానికి రాజధానిగా ఏర్పాటు చేయటంతో గ్రామం పట్నంగా రూపొందటానికి అవకాశం ఏర్పడింది అప్పట్నుంచి ఈ దార్—ఎస్—సలాం పెద్ద నగరంగా త్వరత్వరగా రూపొందుతూ వచ్చింది ఇది టాంగనీకా దేశానికి రాజధానే గాక, టాంగనీకా సరస్సు, విక్టోరియా సరస్సులకు వెళ్ళే రైలుమార్గానికి ఇది మూలస్థానం అందమైన భవనాలు, ముచ్చటగొలిపే ప్రజా జీవనం, కావలసినన్ని క్రీడా సౌకర్యాలుగల నగరం ఇది

ఈ నగరంలోని ఓడరేవు ఎప్పుడూ సందడిగానే ఉంటుంది ఋతువుల ననుసరించి పండే పంటలను ఇక్కణ్ణుంచి దేశంలోని చిన్న చిన్న రేవులకు రవాణా చేస్తారు అరేబియాలోని వివిధ రేవు, పట్నాల్తో కూడా వ్యాపారాలు జరుగుతూ ఉంటాయి

ఈ నగరంనుంచి హిందూమహా సముద్రం వరకు విస్తరించి ఉన్న 'బొటానికల్ గార్డన్స్' నిజంగా చూడదగ్గవాటిలో ఒకటి అందంగా దిద్దిన, చెట్లనుంచి చల్లగాలి వీస్తూ ఉంటే మనస్సుకు హాయనిపిస్తుంది

దార్—ఎస్—సలాం నగరం విపరీతంగా అభివృద్ధి చెందుతోంది ఇక్కడకు విలాస యాత్రలకు వాటికి ఎక్కువగా అమెరికనులు రాకపోకలు సాగిస్తుండటంవల్లనో ఏమో దేశంలో చాలావాటికి అమెరికన్ పేర్లు ఉంటాయి ఓయిస్టర్‌బే, రూజ్‌వెల్ రోడ్డు ఇలాంటివే

ఇక్కడి క్లబ్బుల్లో జనం ఎప్పుడూ తీరిక లేకుండా పనిచేస్తూ ఉంటారు ఇక్కడ గోల్ఫ్ ఆట ఆడుతారు సముద్రతీరంలో ఉన్న స్విమ్మింగ్ క్లబ్బు ఈతలకు మంచి అనువైంది

ఈ టాంగనికా దేశంలో విలాస యాత్రా స్థలాలో ముఖ్యమైంది షిరాజీ శిథిలాలు ఇవి



దార్-ఎస్-సలాం సముద్రతీర దృశ్యం

ఓయిస్టర్‌బేకి దగ్గరగా దార్—ఎస్—సలాంకు పదిమైళ్ల దూరంలో ఉన్న మ్ససానికి దగ్గరగా ఉన్నాయి వెయ్యేళ్ల క్రిందటి నాగరికతకు ప్రతిబింబాలు, స్మృతి చిహ్నాలు, ఈ శిథిలాలు అల్లరి చిల్లరి వాళ్లు వీటిని పాడుచేయకుండా ప్రభుత్వం తగిన కట్టడి కూడా చేసింది

దార్—ఎస్—సలాం నుంచి విమానంలోవెళ్ళి హిందూమహాసముద్రంలో ద్వీపంమీద ఉన్న కిల్వా కిసివాని పట్నాన్ని చూడవచ్చు ఈ ద్వీప నగరాన్ని కీ శ 957 లో పరిషియన్లు కట్టించారు ఇక్కడ వాళ్లు కట్టించిన అందమైన భవనాలు, మసీదులూ కూడా ఉన్నాయి

—టెంపిల్ మానింగ్ ★




పూజామందిరంనుంచి గాలిలో అలలు అలలుగా తేలి సావడిలోకి వినిపిస్తోంది ఒక మధుర స్వరం. 'పేపర్లో తలదూర్చి, సరదాగా 'వరుడు కావాలి' కాలంకేసి చూస్తున్న శేఖర్ దీక్ష విన్నాభిన్నమై చెదరి నలు దిక్కులకీ పరుగెత్తింది. అంగారులో........

కొడుకు మాటలో పడిపోయ్యాడనే అప్రతిమ విన్న శ్రీరాముని పరుగులా ఉంది. ఇక్కడ శేఖర్ దీక్ష పరుగు!

యత్నంగానో—అప్రయత్నంగానో చేతులు పేపరును వదిలేశాయి!! కళ్ళు నలు దిక్కులకీ పరుగెత్తి పూజా మందిరంవు దిక్కుగా ఆగిపోయాయి!! చెవులు దొరగలించి కాస్సేపు నిరీక్షించి కళ్ళు ననుసరించేయి. .

తలకాయ నాగస్వరం విన్న పాము బుర్రలా వూగ సాగింది. ....

శరీరం లేవడంతో ఆ ఆత్రుత్త నిశ్చయానికి పడిపోకుండా ఆధారాన్ని కల్పించి శరీరం లేచేందుకు కృషి చేశాయి చేతులు. . .

కాళ్ళు పూజామందిరంవైపు సాగిపోయాయి—
మన స్సెప్పుడో పూజామందిరం చేరుకుంది—
హృదయం ఎప్పటినుండో లయ తప్పకుండా తాళం వేస్తోంది—
ఆత్మ మశీలా సన్నిధికి చేరి చాలాసేపయ్యింది!
చేరినట్లు నిదర్శనంగా—

కాళ్ళు పూజా మందిరంవు తలుపుల దగ్గరే ఆగిపోయాయి!! కళ్ళకి కనిపిస్తోంది యావత్ప్రపంచం ఆరాధిస్తున్న దేవి స్వరూపం!!!

వీనులకి అష్టోత్తరం మరీ సుస్పష్టంగా వినిపిస్తోంది—

నాసికా పుటాలు వూదొత్తుల ఘమాయింపు వల్ల పూజా మందిరంగా చెప్పేయి.

శరీరం తన దేవి గాలులచే పులకరించిపోయింది.

శరీరపు పులకరింపు పలకరింపుకు పెదాలు విడివిడిగా చిన్న మందహాసాన్ని వెలిబుచ్చాయి!!

ధ్వజస్తంభపు మువ్వల గల గలలా ఉంటుంది తన దేవి స్వరం అనుకున్నాడు తను ఓసారి—మరోసారి—కాదు! పారుతూన్న సెలయేరులా శబ్దంలా ఉంటుంది అని కూడా అనుకున్నాడు—

కానీ—ఇప్పుడనిపిస్తోంది

గర్భగుడిలోని గంటల ధ్వనిలా కూడా ఉంటుంది తన దేవీ గంభీర స్వరం! అని ఇటువంటి సృష్టిని సాగించిన పరమాత్మను స్మరిస్తూ—చేతులు రెండూ జోడించి హృదయ పూర్వకంగా భక్తి పురస్సరంగా అంజలి ఘటించి ఆనందంగా కన్నులు మూసుకున్నాడు శేఖర్—

అష్టోత్తరం పూర్తి చేసి కన్నులు తెరచిన సుశీల కొంచెం ఎడంగా గోడనున్న వెంకటే

శ్వరస్వామి దర్పణపు ఫోటోలో తన స్వామి ప్రతిబింబాన్ని చూసి ఉలిక్కిపడి వెనుదిరిగింది!

మైమరపులోఉన్న శేఖరును చూసి పునః మైమరపులో పడిపోయింది సుశీల!! ఆమెకి తిరిగి స్పృహ వచ్చేసరికి—తన చేతులను అతని చేతుల్లోకి తీసికుని, "సుశీ—సుశీ" అని ఖంగారు పడుతూన్న శేఖర్ కనిపించేడు— సంతతంగా కారుతూన్న కన్నీటిని తుడుస్తూ— "హారతి వెలిగించేయి సుశీ! కళ్ళు కద్దుకుంటాను!!" సాధ్యమైనంత త్వరలో పూజ ముగింపు విధానాన్ని సూచించేడు—

"అనుకున్నంతసేపు పూజ సాగలే దీవేళ—" అనుకుని.

"హారతి కనుల కద్దుకుంటున్నారా?" ప్రశ్నించింది సుశీల!

స్వామి పటంలోని తన దేవి ప్రతిబింబాన్నే తిలకిస్తూన్న శేఖర్‌కు కరుణామయుడు—భక్తపరిపాలుడు అయిన వెంకటేశ్వరస్వామి తనదేవేరిని జ్ఞాపకం తెప్పించాడు!!

అలివేలు మంగకి తనూ, సుశీలా కలిసి మ్రొక్కుకున్న మ్రొక్కులూ, విడి విడిగా మ్రొక్కుకున్నవీ మదిలో మెదలగానే దేవీ సహితుడైన దేవ దేవునకు నమస్కరించి హారతిని మౌనంగా కనుల కద్దుకుని చావడిలోనికి నిష్క్రమించేడు శేఖర్—

మ్రొక్కులూ—ముడుపులూ జ్ఞాపకానికి రాగానే గతంలోకి జారిపొయ్యాడు శేఖర్ డ్రాయింగు రూములోని సోఫాలో కూర్చుంటూ......

* * *

గేటు మూసేసి వెను దిరిగింది సుశీల!

"ఇలా పూల మొక్కలమధ్యలోనే ఎప్పుడూ ఉండిపోతే......?" మనస్సులో ఈ వూహ మొదలగానే శరీరం అంతా సంతోషం ప్రాకిపోయింది

ఎంత అదృష్టవంతురాలో భారతి......... ఎంచక్కటి మేడ—ముందు ఈ పూల తోటా మరీ బాగుంది......ఇల్లాంటి పూదోటలో హాయిగా ఉండలేక—ఎందుకోఎప్పుడూ ఏదో దిగులుగానే ఉంటుంది.......

తోటమాలి కా (లే)క పోయినా కనీసం పువ్వుల మధ్య పచ్చని మొక్కల మధ్య తిరుగాడడంలో ఎంత ఆనంద ముంటుందో......అందుకనే అమ్మ వద్దని అంటున్నా వీళ్ళింటికి వచ్చేసిందీసాయంకాలం

సాయంకాలాల్లో—వేసవి రోజుల్లో—

లీలగా సువాసనలు అలముకున్న చల్లటి పిల్ల వాయువుల మధ్య పచార్లు చేస్తూ మొక్క మొక్కనీ—పువ్వు పువ్వునలా పరామర్శిస్తూ పూదోటలో తిరుగాడడంలో ఎంత హాయి......

పచ్చటి మొక్కల మధ్య జీవితబాటలో పూవులు విరజిమ్మిన వూహల మార్గంలో నడుస్తూన్న సుశీల ఎన్నో విషయాలని మరచిపోయింది.... మొట్ట మొదట—తనెక్కడున్నదీ మర్చిపోయింది....

తర్వాత తానెవరయినదో మరిచిపోయింది—

అటుపిమ్మట తనకీ—ఈ తోటకీ గల సంబంధం అసలే మరచిపోయింది......ఇక తను ఏ లోకంలో ఉందో ఎలా గుర్తించుకోగలుగుతుంది?

మనస్సుకి చాలా ఆహ్లాదంగా ఉంది కాబట్టి స్వర్గంలో ఉన్నానను కొన్నట్లుంది ఆమె వాలకం.....

కానీ—

మొక్కల మధ్య లాన్సులో ఓ కుర్చీలో తల వంచుకుని కూర్చుని ఉన్న భారతిని చూస్తూనే—

ఆమె కళ్ళు మొట్టమొదట ఈ పూదోటని స్వర్గంగానూ, అందులోఉన్న భారతిని దురానికి దేవతగానూ వూహించేయి.......

అసలామె భారతి కళ్ళు దిగాలుగా కనిపించేసరికి—"ఛీ—ఛీ—దేవతలు దిగాలుగా ఎందుకుంటారు—భూలోకంలోనైనా భారతిలాంటి వాళ్ళు తప్ప ఎవరోగానీ— దిగాలుగా ఉండరు"...... అని, అనలుకు శుద్ధ వ్యతిరేకంగా అంతమైన మొదటి వూహని దిద్దేసేసరికి అసలు తనే లోకంలో ఉన్నదీ మొట్టమొదటగా తెలుసుకుంది సుశీల.

ఆ తర్వాత ఈ తోట తన స్నేహితురాలిదనీ—

తాను సుశీలనని అటుపిమ్మట—

ఆఖరున తనున్నది భారతీవాళ్ళ పూదోటలోననీ తెలిసికునేసరికి వేడి నిట్టూర్పు వెలువడిందామె పెదాలనుండి......

విరబూసిన కృష్ణ మందిరం చెట్టంతా వూగుతూ నవ్వడంచూసి మురిసిపోయింది.

మెల్లిగా భారతి దిక్కుగా నడుస్తూ..... "ఈవేళ దేవిగారు తోట పర్యవేక్షణ ఎందుకు చేస్తున్నారో ఎంత వూహించినా నా కర్థమేగావడం లేదు—అయినా భారతీ! పూదోటలో ఉండీ తలవంచుకుని కూర్చుంటే పూల అందాలు నీ కెలా తెలుస్తాయిట? నీ కెదురుగా విరగబడి నవ్వుతూన్న ఆ అందాల టెంకిన పువ్వులను చూడు ..... నీవీ వేళ ఇలా వచ్చేవని చిరుగాలికి వంగున్నట్లు నటిస్తూ ఒక దానితో ఒకటి రహస్యంగా నవ్వుకుంటూ చెప్పుకుంటున్నాయి.......ఎదురుగా అందాలు విరజిమ్ముతూన్న వాటన్నిటినీ వదిలి తలవంచుకుంటే ఏం లాభం? తలెత్తి........"నవ్వుతూ లాన్సులో ప్రవేశించేముందు భారతి ఎదురుగా సిమెంటు సోఫాల్లో విరబూసిన టెంకిసముందు ఎవరో నవ యువకుడూ, అతనికిరు వైపులా ఎవరో పెద్ద మనుష్యులూ కనిపించేసరికి చెప్పబోయే విషయాన్ని అక్కడితో ఆపేసి తల నిటు త్రిప్పేసరికి తలవంచుకున్న భారతి వెనకగా వాళ్ళ అమ్మా, మరికొందరు ఆడపరివారాన్నీ చూసి నిర్ఘాంత పోయింది.......

లాన్సులో ప్రవేశ మార్గం గుండా దూరంనుండి భారతి తప్ప మరెవ్వరూ కనపడలేదు.....వాళ్ళంతా మొక్కల మధ్యలో కనుపించ లేదన్నమాట— బహుశా ఇది పెళ్ళి చూపుల తతంగమేమో.....? ఉలిక్కిపడి వెనుదిరిగింది సుశీల.

(తెల్లటి చీర పొడుగునా నవ్వింది—

బారెడు జడా మెలికలు తిరిగిపోయింది—

తల్లోని మల్లెదండ ఒఖ్ఖసారిగా ఫకాలుమని నవ్వి మళ్ళీ వూరుకుంది.)

అకాత్తుంగా వెనుదిరగడంవల్ల "ఖంగారేమిటోయ్" అంటూ గులాబీ తన చిన్ని చిన్ని ముళ్ళతో ఆమె పైటకొంగును పట్టుకుని వెనక్కు లాగింది..

"ఇప్పుడుకాదు—నీతో మరోసారి మంతనాలాడతాలే—"అంటూ గబగబా కొంగును విదిలించుకుని రెట్టింపు ఖంగారులో మాయమైపోయింది పాపం సుశీల......

"ఎదురుగుండా కూర్చున్న అమ్మాయికంటే చుట్టూ ఉన్న పూలబాలలనుచూసి సంతోషించి మానవయత్నంతో పెంచినఈతోటేఎంతోబాగుంది— పరమాత్మ స్వయంగా తన చేతులలో సృష్టించిన ఆ అమ్మాయికంటె" అనుకుంటూన్న పెళ్ళికొడుకు అనుకోని సుగంధ పరిమళాలు ఒక్క గాలి తెర మోసికొచ్చి మరో గాలి తెర తీసికెళ్ళి పోయేసరికి తెల్లబోయి ఉక్కిరి బిక్కిరైపోయాడు. వాళ్ళు సంబంధాలనోగానీ తేలేక—కూతురికి పెళ్ళి చేసెయ్యాలనే పట్టుదలలో ఉన్న భారతి తల్లి తండ్రులు అనుకోకుండా వన కన్యలా వచ్చి—ఇట్టే మాయమైన సుశీలవల్ల నిర్ఘాంత పడిపోయి తెల్లమొహాలు వేసేసిన వాళ్ళు బరువు వదిలిపోయిన నిట్టూర్పు వదిలేరు.......

నిశ్శబ్దాన్ని మధురంగా భంగపరచి, తిరిగి గంభీర నిశ్శబ్దంలోకి వాళ్ళందర్నీ గెంటేసి పోయింది సుశీల—

అనుకోకుండా ఉక్కిరి బిక్కిరైన వాతావరణం సర్దుకుంది.......

పెళ్ళి కొడుకు మనస్సు కూడా సుశీల వెంబడే వెళ్ళిపోవడంవల్ల మర్యాద కాస్సేపు అతన్ని ఆవగలిగింది. ఆపైన అతను లేచి నుంచున్నాడు.....

"వెళ్ళగానే ఉత్తరం వ్రాస్తాం—" అతని వైపు. పెద్దలు మాట వరసకి అంటున్నారు— వాళ్ళకి నచ్చింది కూడా సుశీలే కాబట్టి.....

"కట్నం పదివేలు—లాంఛనాలు యథావిధిగా జరిపిస్తాం......" పెళ్ళికూతురి తండ్రి చేతులు నులుముకుంటూ అంటున్నాడు. ఎంత వదిలితేనో గానీ లక్ష్మీదేవిలాంటి కూతురు మరొకళ్ళ ఇంటికి పోదు అనే బాధలో......

"ఆలాగే......" తలలూపుతూ వాళ్ళు వెళ్ళిపొయ్యే సమయానికి భారతీవాళ్ళ మేడమీద అద్దెకి ఉంటూన్న వనజని సమీపించి వణికిపొసాగింది సుశీల.

చాలాసేపు ఓదార్చి కాస్త కాఫీ దానికి ముందుగా చల్లని పానీయాన్ని కూడా ఇచ్చి సుశీల సేద దీర్చి టెర్రస్‌మీదకు తీసికొచ్చి కుర్చీలో ఆసీనురాలు కావించి కారణాలూ, వివరాలూ అడిగింది తాపీగా వనజ—సుశీల ఖంగారుగా విశితంగా పరికిస్తూ!!!!

"వాళ్ళ భారతికి పెళ్ళి చూపుల తతంగం కాబోలును జరుగుతోంది—నాకు తెలియక నేను వెళ్ళేనే.......అసలే ఆమెకు సంబంధాలు కుదరక వాళ్ళూ నానా అవస్థా పడిపోతున్నారు....వస్నేమైనా అనుకుంటారేమో......" నట్టుకుంటూ, నిట్టూర్పు నణచుకుంటూ చెప్పింది సుశీల!

సుశీలని ఆపాద మస్తకం పరికించి—"అవును పెళ్ళి చూపులే........నీ అలంకరణ దానికి తగ్గట్టుగానే ఉందిలే......" నవ్వింది వనజ—

"ఛీ—ఏమిటా వాగుడు మాటలు—నే నసలే ఖంగారు పడుతూంటే—" అంటూనే ఖంగారుగా తన్ను తాను చూసుకుంది సుశీల—

తెలుపు చీర—

బారెడు జడా—

జడలో పువ్వులూ—

గళసీమలో మెరుస్తూన్న ఒంటిపేట గొలుసూ ఉలిక్కిపడింది...... "నిజమేనేవ్—" అంటూ పాపం........

"ఏం ఫర్వాలేదు—జరుగవలసిన పెళ్ళి చూపులు జరిగిపొయ్యాయి—ఇక మీ వాళ్ళని వెతుక్కుంటూ వెడతారులే......" నవ్వేసింది వనజ....

"ఛీ......ఛీ....పోవే—" వనజ ఎదురుగా అవడమైతే అంది గానీ—ఆతర్వాత నిజంగా వాళ్ళు వాళ్ళనీ—వీళ్ళనీ అడిగి తండ్రిని కలిసికున్నారని తెలిసి తెల్లబోయింది.....

38 వ పేజీ చూడండి

గ్రహస్థితి

మిథునంలో రాహువు, సింహకన్యలలో సూర్యుడు, కన్యలో బుధశుక్రులు, తులలో అంగారకుడు, ధనస్సులో కేతువు. మకరంలో శని, మీనంలో గురువు, మిధున కటక సింహ కన్యలలో చంద్రుడు.




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**13-9-1963 శుక్రవారము మొదలు**
**19-9-1963 గురువారము వరకు**

## మేషం:

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ సమయంలో మనస్సు ఆందోళనకు గురి అవుతుంది. అడిగేవారికి చెప్పేవారు లోకువ. రహస్యం కాపాడుకొంటూ కార్యం సాధించుకొనవలసిన సమయం. ఖర్చులు అధికం. కుటుంబంలోను, బాహ్య విషయాలలోనూ కార్యభారం పెరుగుతుంది. అధికారులతో ఏ విషయంలోను పేచీలకు దిగవద్దు. క్రొత్త ప్రయత్నాలు అందుబాటుకు వచ్చినట్లు కనుపిస్తవి. కాని, స్వల్ప కారణాలు అడ్డువస్తూ ఉంటవి. ఇంతకు ముందు చేసిన శ్రమ, ధనవ్యయము నిరుపయోగమనే విషయం తెలుస్తుంది. మీ సొమ్ము తింటూ ఎదటి వారికి సహాయం చేసేవారు తటస్థ పడతారు. 18, 19 తేదీలలో దేహబాధలు, పనులలో నిదానం.

* * *

## వృషభం:

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

మీరు కొంచెం నిదానిస్తే ప్రశాంతంగా ఫలితం చేతికి వస్తుంది. ఎదటివారి మాటను అర్థం చేసుకొని కార్యరంగంలో దిగటం అవసరం ఆదాయం బాగానే ఉంటుంది. అయితే ఇతరుల సలహాలవల్ల నిరుపయోగమైన పనులలో దిగే అవకాశాలున్నవి. ఈ సమయంలో మీ ఆసక్తికి తగినట్లు పరిస్థితులు కూడా ఆకర్షణీయంగా కనుపిస్తూ ఉంటవి. ఒక సమయంలో ఒప్పుకున్న పనిని ఎలా నెరవేర్చగలమనే ఆందోళన పట్టుకుంటుంది. పిల్లల ఆరోగ్యం బాగుండదు. వ్యాపార వ్యవహారాలలో నీచులతో కలహాలు రాగల అవకాశాలున్నవి. మిమ్మలను మోసగించటానికి ప్రయత్నాలు జరుగుతవి. జాగ్రత్తగా ఉండండి.

* * *

## మిథునం:

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఈ వారం కొన్ని సమయాలలో మీ మాట గొప్పగా చలామణి అవుతుంది. ధనాదాయం కూడా బాగుంటుంది. అతిసూక్ష్మ విషయాలను కూడా సులభంగా పసిపట్ట గలుగుతారు. కష్టమును లెక్కపెట్టకుండా పనిచేయవలసి ఉంటుంది. బంధుమిత్రులు మీ మాటను వ్యతిరేకించటానికి చూస్తారు ప్రయాణాలు అనుకూలిస్తవి. వారం రెండవ భాగంలో శుభవార్తలు తెలుస్తవి. అధికారులను కలుసుకొంటారు. సంఘ కార్యాలలో చిక్కులను తప్పించుకొంటూ ముందుకు పోవలసిన సమయం. శారీరకంగా సుఖం తక్కువ. పొరపాట్లు చేస్తారు. 13, 14 తేదీలలో ధనలాభం, చిన్నచిన్న పేచీలు, కార్యసిద్ధి.

* * *

## కర్కాటకం:

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

గ్రహబలం బాగున్నది. ఇంతకుముందు జరిగిన పొరపాట్లను సర్దుకోగలుగుతారు. ఒక సమయంలో శ్రమతోనైనా చివరకు ఫలితం బాగుంటుంది. వృత్తిలో అందరి ఆదరాభిమానాలను సంపాదించుకొంటారు ఆర్థికంగా పెద్ద మార్పు కనుపించక పోవచ్చు. కాని, సుఖము, సంతృప్తి బాగుంటవి. దైవ కార్యాలు సుఖంగా జరుగుతవి. తలవని తలంపుగా నీచులతో కలహాలు రాగల అవకాశాలున్నవి ఇతరుల కార్యభారం పైన వేసుకొన తగిన సమయంకాదు. వ్యవహార రంగంలో నిదానం ఎక్కువ. ఖర్చులు పెరుగుతవి. మనోధైర్యం అవసరం. 17, 18 తేదీలలో ధనలాభం, అధికారుల స్నేహం.

* * *

—ఈ వారము ధరలు—

పసుపు ధర మందీ అవుతుంది. రంగుల (పెయింట్ల) ధరలలో పెరుగుదల కనుపిస్తుంది. వేరుశనగపప్పు ధరలో ప్రోత్సాహం కనుపించదు. మాసె ధర గతవారంవలె ఉంటుంది. మిర్చి ధర తగ్గుతుంది.

## సింహం:

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

మీరు తలపెట్టిన పనులు సాఫీగా జరుగుతవి. ఎక్కడికి వెళ్ళినా ఆదరణ లభిస్తుంది. పదిమంది మీ సహాయం కోరే సమయం. కుటుంబ సమస్యలు మిమ్మలను నిరుత్సాహపరుస్తున్నా వ్యవహార రంగంలో జయం సాధించగలుగుతారు. కొంచెం దుబారా మాత్రం పెరుగుతుంది. వృత్తి వ్యాపారాలలో అభివృద్ధి కరమైన మార్పు కనుపిస్తుంది. ఒక సమయంలో పెద్ద మనుష్యులను నమ్మి ఇబ్బంది పడతారు. ప్రతి విషయం జ్ఞాపకం ఉంచుకొనటం అవసరం. నౌకరులవల్ల పొరపాట్లు జరిగే సమయం, యదార్థం తెలుసుకోకుండా గాలివార్తలు విని బాధపడవద్దు. 14, 15 తేదీలలో త్రిప్పట, ధనవ్యయం.

* * *

## కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ఏ పనిలో దిగినా చివర లోపంతో నిలిచిపోతుంది. ఏదో ఒకరూపంలో ఇతరుల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. మబ్బును చూచి విత్తులు చల్లినట్లుగా తొందరపడి ఏపనీ ఆరంభించవద్దు. తలవని తలంపుగా కలహ ప్రసంగాలు వస్తవి. శ్రమ పెరుగుతుందేగాని, ఆదాయం మామూలుగా ఉంటుంది. బాహ్య విషయాలలో అసూయాపరులను తప్పించుకొంటూ పనులు సాగించవలసి ఉంటుంది. భారీ కార్యక్రమాలను తగ్గించుకొనటం మంచిది కోర్టు కచేరీలలో కొంచెం మంచి మంచి సూచనలు కనుపిస్తవి. సంఘ కార్యాలలో నిరుత్సాహం తోస్తుంది. కాని అనుకూలత ఉంటుంది. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి.

* * *

## తుల:

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ప్రస్తుతం వృత్తిలో వచ్చే హెచ్చుతగ్గులు వల్లగా తొలగి స్థిమితం లభిస్తుంది. ముఖ్యంగా

మీ మాటకే ప్రాధాన్యం లభిస్తుంది. ఒక సమయంలో ఆదాయం తగ్గినట్లు తోచినా మొత్తం మీద లోటు కనుపించదు. వ్యవహారరంగంలో ముందుగా మాట జారకుండా చూచుకొనండి. ఇంతకు ముందున్న కొరతలు చాల భాగం పూర్తి అవుతవి. మనోనిబ్బరం లభిస్తుంది. మొదట స్వవిషయం చూచుకొంటూ అవకాశాన్ని బట్టి ఇతరులకు సహాయం చేయటం మంచిది. పిల్లల ఆరోగ్యం బాగుండదు. ఈ సమయంలో మాటలతో సంతోష పెట్టేవారేగాని, క్రియలలో ఉపయోగం తక్కువ. ప్రయాణ సూచనలున్నవి.

*  *  *

**వృశ్చికం:**

**(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ఈ వారంలో తరచు నిరుత్సాహానికి అవకాశాలున్నవి. తలపెట్టిన పనులు ఎటూ తేలవు. అయితే పూర్తిగా భంగం కావు. బంధుమిత్రుల నిష్ఠురాలు, బెదరింపులు కనుపిస్తవి. మధ్యవర్తులుగా యున్నవారు విశ్వాసంతో పనిచేయక పోవటం వల్ల కలహాలకు అవకాశాలున్నవి. స్వశక్తితో నిర్వహించే పనులు జయప్రదంగా ఫలిస్తవి. శుభ కార్య సందర్భాలలో మీరు తొందరపడిన కొద్దీ అసలుకే మోసం రాగల అవకాశాలున్నవి. ఉష్ణ దోషంవల్ల బాధపడతారు. ఈ సమయంలో మీ సుఖమునకు కావలసిన సౌకర్యాలు సమయంలో అమరవు. అధికారులను కలుసుకొంటారు. 16, 17 తేదీలలో కార్యభంగం.

*  *  *

**ధనుస్సు:**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

అన్ని విధాలా మంచి సూచనలున్నవి. ధనము, గౌరవము లభించగల సమయం. ఈ వారంలో ఎక్కువ భాగం ఇతరులకోసం వినియోగిస్తారు. దైవకార్యాలలో పాల్గొంటారు. క్రొత్తవారి మైత్రి లభిస్తుంది. ఇంతకుముందు మీ మాటను అనుసరించేవారు క్రమంగా తప్పుకొంటారు. వృత్తి ఉద్యోగాలలో ఉత్సాహము, అధికారము బాగుంటవి. ప్రయాణ సూచనలున్నవి. వినోద విషయాలలో పాల్గొంటారు. కాని, సంతృప్తి తోచదు. ఆదాయం బాగుంటుంది. కోర్టు కచేరీలలో గౌరవప్రదమైన కాలం ధనసంబంధమైన లావాదేవీలలో కలహ సూచనలు కనుపిస్తవి.

*  *  *

**మకరం:**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఎక్కడి పనులు అక్కడనే నిలిచి ఉంటవి. ఇంతకుముందు చేసిన శ్రమకు ఆదాయం చేతికి వస్తుంది. ఓర్పుతో పనిచేయ వలసిన సమయం. దూరమందున్న మిత్రులవద్ద నుంచి లాభవార్తలు తెలుస్తవి. గౌరవయోగం బాగుంటుంది. కుటుంబంలో రోగాలు నొప్పులు మొదలయిన వాటి వల్ల చికాకు కలుగుతుంది. వృత్తిలో మీ ప్రయత్నం కన్నా అకస్మాత్తుగా కలసివచ్చిన అవకాశాలు చక్కగా నెరవేరుతవి. శుభవార్తలు వింటారు. మీరు మీ తాహతుకు మించి భారం పెట్టుకొన తగిన సమయంకాదు. ప్రయాణాలు సుఖంగా జరుగవు. మీరు పొరపాటు పడితే అవకాశాన్ని వినియోగించుకొనేవారు ఉంటారు. 15, 16 తేదీలలో నిరుత్సాహ కారణాలు, సాటివారితో పేచీలు.

*  *  *

**కుంభం:**

**(ధనిష 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

సమయం మంచిది. మీ సహాయం కోరివచ్చిన వారు ఉంటారు. సంఘంలో పలుకుబడి పెరుగుతుంది. అన్ని విషయాలలోను అనుకొన్నది, అనుకొన్నట్లే జరుగుతుంది. ఇంతకు ముందున్న శ్రమ తగ్గుతుంది. శత్రువులకు సమయంలో చక్కగా సమాధానం చెప్పగలుగుతారు. అయితే ఇతరుల మాటకు మీరు తొందరపడడం మంచిదికాదు. వ్యవహార రంగంలో జయం లభిస్తుంది. మీ సుఖము, సౌకర్యము వీటిని కాపాడుకొంటూ కార్యరంగంలో దిగటం మంచిది. పోయి వనుకొన్న వస్తువులు తిరిగి లభిస్తవి. వారాంతంలో నీచులతో స్నేహం చేస్తారు. సంతో వార్తలు తెలుస్తవి. ధర్మ కార్యాలు చేస్తార 18, 19 తేదీలలో ఆందోళన, కార్యసిద్ధి, లాభవార్త

*  *  *

**మీనం:**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

మీరు ఎవ్వరిని అభిమానిస్తున్నారో వారు మిము లను అభిమానించరు. ఏ కార్యక్రమంలో దిగు మన్నా మనస్సు ధైర్యంగా నిలవదు. అధికా లతో మాటలు పెరిగే అవకాశాలున్నవి. భాగస్థులతో కలసి చేయుపనులు అశాంతిని కలిగిస్త బంధుమిత్రులకు సంబంధించిన సమస్యల పైన వేసుకుని కష్టపడతారు. ఒక సమయం ఎంతో గౌరవం ఉన్నట్లు తోస్తుంది. కా మరొక సమయంలో అందుకు పూర్తి వ్యతిరేకంగా భావించటం జరుగుతుం ఆదాయం మామూలుగా ఉంటుంది. అంచనా మించిన ఖర్చులు. పిల్లల ఆరోగ్యం తృప్తి ఉండదు. ఘనోనిగ్రహం, విశ్రాంతి అవసరం.







అమ్మ దానిని
పత్రికలలో చూసింది
నాన్నతో చెప్పింది
అప్పుడు నేను విన్నాను...
ప్రతి దుకాణములోను ప్రతి పట్టణములోను
పిల్లల కొరకు ఆహారము - గ్లాక్సో
పేర్చబడి వుంది.
ఎంతో ఎక్కువగా పేర్చబడి వుంది.
ఇంకా మీకు తెలుసునా
గ్లాక్సోతో నేను బలముగాను
ఆరోగ్యవంతముగాను
పెరుగుతానని
ఎంత సరదాగా వుంది!

గ్లాక్సోలో, ఇంచుమించు, తల్లి పాలలో వుండే గుణాలన్నీ వున్నాయి... మీ బిడ్డ బలముగాను ఆరోగ్యవంతముగాను పెరుగుటకు కావలసిన వన్నీ వున్నాయి. గ్లాక్సో బేబీ పుస్తకం ఉచిత ప్రతి(తెలుగులో) 50 న.పై.(తపాలా ఖర్చుల నిమిత్తం) గ్లాక్సో, వుడ్స్ రోడ్, మద్రాస్-2 ఈ చిరునామాకు పంపండి.




GLY-2-TEL.

**Glaxo**

గ్లాక్సో—పసి బిడ్డలకు సంపూర్ణ పాల ఆహారము

# సింహస్వప్న నామకుటం

## చీఫ్ యినస్పెక్టర్ ఛార్లెస్ చనివీర్ (పారిస్ ఫ్రాన్స్)

(గత సంచిక తరువాయి)

మళ్ళీ కథ మొదటి కొచ్చింది. ఏ నేరస్థుడి కయినా అతనితో పరిచయము, మంతనాలు ఉంటా యేమోనని నేరస్థులను వెంబడించాము. అతను దొరకడానికి చాలా ఆలస్యం అవుతుందనుకున్నాము. కానీ మేముకున్నంత ఆలస్యం అవలేదు. పారి పోయిన ఎమైల్‌కి డబ్బు కావల్సొచ్చింది. ఓ వారం లోపునా మరో అఘాయిత్యం చేసి, ఫ్రాన్సు చరిత్రలో హాహాకారాలు పుట్టించాడు.

తన దోపిడీకి పారిస్ పడమర భాగాన్న ఆర్కెడె ట్రయంఫ్‌కి దగ్గరగా నున్న 'ఆ బర్గ్ అల్ఫ్రెయిజ్' అనే అందమైన హోటలు ఎన్ను కున్నాడు.

ఓ వయస్సు తీరిన వెలయాలి ఇంట్లో మకాం వేసి, దోపిడి ఎలా చెయ్యాలో, ఎప్పుడు చెయ్యాలో, ఏ దారిగుండా పారిపోవాలో, పారిపోడానికి అవసర మైన కారు ఎవరి దగ్గర్నుంచి తస్కరించాలో నిర్ణయించుకున్నాడు.

దోపిడి నాటి రాత్రి ఎమైల్ బోయిసన్ రుజాక్ అనే అతనూ రివాల్వర్లు పట్టుకుని ఆ హోటల్లో ప్రవేశించారు. డెక్కర్ అనే అతను మెషిన్‌గన్ పట్టుకుని కావలి కాశాడు.

"చేతులు పైకెత్తి గోడవైపు తిరిగి, క్యూలో నిలబడండి."అని నిర్ఘాంతపోయి, కొయ్యబారిన ఇరవై మందిని బెదిరించాడు.

ఎమైల్‌బాయిసన్ వారందరివద్ద నగా, నగదు తడివి భుక్త పరుచుకున్నాడు. రుజాక్ కూడా వసూలు చేశాడు. ఆనక ఎమైల్‌గల్లా పెట్టెలో లోంచి 1000000 ఫ్రాంకులు తీసుకుని బయట పడ్డాడు. ఇంతలో "పోలీసులు" ! అని డెక్కర్ అరిచాడు. అతి త్వరగా ముగ్గురూ కారెక్కి పరారై పోయారు. ఇద్దరు పోలీసు ఉద్యోగస్థులు మోటారు సైకిళ్ళమీద వారిని వెంబడించారు. సైరన్ కూతలు మిన్నంటాయి. పారిస్ దాటుతున్న కార్లన్నీ తనిఖీ చెయ్యాలని ఆర్డర్లు, ఆదేశాలూ వెళ్ళిపోయాయి. ఎమైల్ కారుడ్రైవరు మారిస్ అతి జాగ్రత్తగా గంటకు డెబ్బయి మైళ్ళ వేగంలో నడిపాడు. ఎమైల్ డెక్కర్‌వద్ద మెషిన్ గన్ తీసుకుని, కారు వెనకద్దం పగలగొట్టి ఆ పోలీసులమీద గుళ్ళ వర్షం కురిపించాడు.

చిట్ట చివరికి తప్పించుకు పోయారు.

*           *           *

కొన్ని రోజులు గడిచాయి. రుజాక్ (ఎమైల్ గ్యాంగులో ఒకడు) శరీరం గాయాలతో నిండి, బోయిస్ డి ఆర్ట్రే అనేచోట కనుగొన బడింది. ఆ వారాంతంలోనే మా పోలీసులు డెక్కర్‌ని ఒక బార్‌లో పట్టుకున్నారు. అతను తన తప్పుని ఒప్పు కుని, రుజాక్ చావు ఎలా సంభవించిందో చెప్పాడు—

— ఆ హోటల్లో చేసిన లూటీలో దొరికిన నగల్లో ఒక నెక్లెను మాత్రం మొత్తం సొమ్ములో కలపకుండా రుజాక్ తన ప్రియురాలికి ఇచ్చాడని, అదిగాక సుజాన్‌ఫార్ (ఎమైల్ ప్రియురాలు)తో సరసాలాడినట్టు ఎమైల్‌కి తెలిసిందని కూడా, డెక్కర్ చెప్పాడు.

ఈ రెండు కారణాల్లో ఏ ఒక్క కారణమైనా అతన్ని చంపడానికి చాలు ! !

"— మళ్ళీ బోయిసన్ ఆర్ట్రెలి దోచుకోడానికి వెళుతున్నపుడు దారి మధ్యలో ఎమైల్ కారాపి కాస్సేపు విశ్రాంతి తీసుకోవచ్చని ఆదేశించాడని, సిగరెట్టు ముట్టించబోతున్న రుజాక్‌ను వెనుక నుంచి రివాల్వర్‌తో నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపి, "ఇది మిగతా వారికో గుణపాఠం" అని హెచ్చ రించాడని కూడా డెక్కర్ చెప్పాడు.

'ఇదే విధంగా ఎమైల్ చేతిలో డీస్పైర్ పాలెడ్రూ అనే అతను కూడా అంతం పొందాడు. 1949 మే, నెలలో మొరాకో బ్యాంకులో నోట్లను అచ్చు వేసే అచ్చు మిషనుమీద దాడిచేసి 112 మిలియన్ల (మొరాకో బ్యాంకు) నోట్లు కాజేశారు.

ఈ దోపిడి జరిగిన రెండో రోజున పాల్‌డ్రూ తన తుపాకి తుడుచుకుంటుండగా అది ప్రమాద వశాత్తు పేలి— ఎమైల్ కారు డ్రైవరు మారీస్‌ను చంపింది. ఎమైల్ అంతరంగికుల్లో ఒకణ్ణి చంపా నన్న భయంకొద్దీ పాలెడ్రూ పశ్చిమ జర్మనీకి పారిపోయి, అధికార స్వరంతో కూడిన ఎమైల్ ఫోను పిలుపు వల్ల గిర్రున తిరిగి పారిస్ వచ్చేశాడు.

వచ్చి ఒక హోటల్లో ఎమైల్‌ని కలుసు కున్నాడు. ఎమైల్ క్రోధంతో గాక, ప్రశాంతంగా ఉండడం చూసి 'ఇక గండంలేదు" అనుకున్నాడు. ఎమైల్ ఓర్ఫేని అనే మరో కొత్త వ్యక్తిని పాలెడ్రూకి పరిచయం చేశాడు. కావైర్ (ఓరక మైన ఖరీదైన వూరబెట్టిన చేప), కోడి భోజనంతో విందు చేసి, విస్కీ ఇచ్చాడు.

*           *           *

పార్టీ అయ్యాక, దగ్గర దారిగుండా వెళ్దా మని ఎమైల్ నడక ప్రారంభించాడు. కొంత దూరం వెళ్ళాక పాలెడ్రూ ఆ ప్రదేశం చూసి, "నన్ను మట్టు పెట్టాలను కుంటే ఇంత కన్నా మంచి ప్రదేశం దొరకనే దొరకదు" అన్నాడు నవ్వుతూ. అంతలో ఒక నల్లని, నిగనిగలాడే కారు తన వెలు తురుతో చీకటిని చీల్చుకుంటూ వచ్చి ఆగింది. ఎమైల్ తన జేబులోంచి తుపాకి తియ్యడం చూచా యగా పాలెడ్రూ చూచాడు. అంతే ! ! ఆనకేం జరుగుతుందో అనుకునేలోగా అయిదు గుళ్ళు అతన్ని అంతం చేశాయి.

ఎమైల్ రివాల్వరు జేబులో పెట్టుకుని, నేలమీద పడి గిలగిల్లాడుతున్న పాలెడ్రూని కాలుతో నిర్లక్ష్యంగా తన్నుతూ, "ఈ మాత్రం శాస్తి జరిగితేగాని, తుపాకులతో అజాగ్రత్తగా ఉండ కూడదని తెలీదు" అన్నాడు కర్కశంగా.

*           *           *

ఎమైల్ బోయిసన్ జతగాళ్ళలో ఎవ్వరూ కూడా చాలా కాలం బతికినవారు లేరు. అతని స్నేహంవల్ల ప్రాణాలను కోల్పోయినవారి జాబితా నా నోట్ పుస్తకంలో ఉంది. ఓ చిన్న చిలిపిచేష్ట, ఓ చిన్న తప్పు, ఓ మాట తేడా, ఓ వెటకారం, ప్రేమ పిచ్చిలోగాని, పిచ్చి ప్రేమలో గాని పడడం, తన స్త్రీ వంక చూడడం— వీటిలో ఏది జరిగినా ఎమైల్ వారికి అతి సునా యాసంగా మరణదండన విధించి అమలు జరిపే వాడు.

*           *           *

మళ్ళీ ఫ్రెంచ్ పోలీసు బలగమంతా అతని వేట ప్రారంభించింది. నా బలగాన్ని నేను చాలా జాగ్రత్తగా వినియోగించాను. ప్రతీస్టేషనులో రేవుల్లో విమానాశ్రయాల్లో, హోటళ్ళల్లో హైరోడ్డుల్లో ప్రతీ చోటా గస్తీలు ఉంచాను, కానీ ఎవ్వరికీ అందకుండా ఉండ వీలయ్యేది ఒక్క పారిస్ నగరమేనని, బోయిసన్ (ఎమైల్)కి తెలుసునని నాకు తెలుసు.

అతను మరో తప్పు చేసేవరకూ మేము వోపి కతో వేచి ఉన్నాము. అతి త్వరలో చెయ్యాలి. లేదా, కనీసం తన జట్టులో ఒక్కర్నయినా చంపాలి. ఆ క్షణం కోసమే అనుక్షణం నిరీక్షణ.

పాలెడ్రూ చావుచూసి, ఆ సంగతి మాతో చెప్పే ఎమైల్ కారు డ్రయివరు (కొత్తవాడు) జాన్ జాయిట్ మాకు లొంగి పోయాడు. పాలెడ్రూ చావు సంగతి మాకు ముందు తెలియజేస్తే ఆ నాడే అతన్ని బంధించుండేవాళ్ళం. కానీ జాన్ జాయిట్ కాస్త ఆలస్యం చేశాడు. అవకాశం ఆకాశానికెగిరి పోయింది.

అతన్ని పట్టుకోవాలంటే మరొక్క సారి ఎమైల్ 'దాడి' చెయ్యాలి. ఇంకో చావు సంభ వించాలి. అది జరగనే జరిగింది. 1950 ఫిబ్రవరి 17వ తేదీన వార్సెల్స్‌లో జరిగింది. అది జరిగిన మూడు నెలలలో ఎమైల్ మాకు 'త్రిషెల్స్' (హోటల్)లో పట్టు బడ్డాడు.

*           *           *

జాన్ బెవెర్న్ అనే డ్రైవరు ఒక ఆఫీసు నుంచి హెడ్డాఫీసుకు కొంత సొమ్ము పట్టు కెళ్ళ బోతున్నాడని ఎమైల్ పసిగట్టాడు. హెన్రీ క్లైబాట్, హెన్రీబ్రికోర్ట్ అనే వారిని తీసుకుని

35 వ పేజీ చూడండి

# నా అనుభవంలో కెల్లా పెద్ద పరిశోధన-19


ముప్పాళ
రంగనాయకమ్మ
నా డైరీలో ఒక పేజీ!

## సీరియల్ ప్రారంభం:

చివ్వరికి. .

గోపాలం అదే గోపాళ్రావు తన హృదయవేదన దించేసుకోటానికే నిశ్చయించుకున్నాడు సరోజాదేవికి ... అంటే మిస్ సరోజకు ఏమైనా సరే ప్రేమలేఖలాంటిది ... లాంటిదేమిటి ? ప్రేమలేఖే లవ్ లెటర్—రాసెయ్యాలని తీర్మానించుకున్నాడు తన ధైర్యాన్ని తల్చుకు తనే ఓసారి విస్తుబోయి చటుక్కున లేచిపోయి మరి వెనకా ముందూ చూడకుండా (చూశాడో సరోజలాంటి మరో రోజా దారేబోతూ కన్పించనూవచ్చు కన్పించిందో తాత్కాలికంగా గోపాలం ఏకాగ్రత (ఎంతైనా మనస్సు కోతిలాంటిది కదా మరి? అసలు మనిషి కోతిలోంచే పుట్టాడట చెదిరిపోనూ వచ్చు) డెస్క్ బర్రునలాగి కలం, కాయితం అదే పెన్నూ పేపరూ బయటికి తీశాడు వెంటనే శ్రీకారం చుట్టబోతే సమ్మెచేసింది అల్లరి కలం—"అరె!" నాలిక్కరుచుకున్నాడు కంగారుగా "ఇంకు నిన్ననే నిండుకుంది మరిపొయ్యనే లేదు ప్చ్! వెధవ మతిమరుపు" విసుక్కుంటూ సిరాబుడ్డి, సొరుగులోది ఎత్తి టేబుల్‌మీద పెట్టాడు "ఏదీ? 'ఇంక్‌ఫిల్లర్' ? హా! ఇదో దాగుడు మూత కాబోలు పోనీ! ఎవడు వెతుకుతాడు!? టైం వేస్ట్! అసలే టైమ్ లేదు!"

కోపంగా సిరాబుడ్డి ఒంచేస్తే సర్రున కలం నిండి లుంగీమీదికి ధార కట్టింది సిరా! కంగారులో చేతిలోంచి జారిన సిరాబుడ్డి ఒడిలోంచి కాళ్ళమీదుగా వెళ్ళి "ఛ! ఛ! ఏమిటిది? ఛ! ప్చ్! వెధవ " నిట్టూర్పులతోపాటు లుంగీ విడిచి గది తుడుచుకుని చేతులు కడుక్కుని " "అయినా ఇప్పుడే బావుంది హాయిగా నీటుగా అవును" పరిస్థితులతో రాజీ పడిపోయాడు గోపాలం (సంతృప్తి చెందడమే సుఖ జీవనానికి మూలసూత్రం)

సన్నగా పొడుగ్గా ఉండే గోపాలం సన్నగా పొడుగ్గానే ఉంటున్నాడు తెల్లగా ఏకులా ఉండే గోకాలం కాస్త కసువూసినా వూరుకుంటున్నాడు నొక్కులు జుట్టులేని గోపాలం ఉన్న జుట్టునే దువ్వుకుంటున్నాడు పాపం గోపాలం చాలా మంచివాడు!

"అయితే ఏం రాయాలి? రాస్తానను కున్నానా? అబ్బ! ఏమిటో? ఓ ఉత్తరం ప్రేమలేఖ మిస్ సరోజాదేవికి అమ్మో! ఎలా? ఏమని?"

ఛ! ఈ తర్కంతోనే కాస్త భయం భయంలాంటిదే వేస్తోంటే గోపాలానికి ఛ! మూడ్ పోయింది వెధవది 'మూడ్' వచ్చేసరికి పెన్ను లేదు పెన్ను తీస్తే ప్చ్! ఇంకులేదు ఇంకుపోస్తే మూడ్ రాదు

రాదు? ఎందుకురాదు? మిస్ సరోజమీద ముద్దుల సరోజమీద పొద్దస్తమానూ ప్రేమ పుడుతోండగా 'మూడ్' ఎందుకురాదు? వస్తుంది .. .అదే వస్తుంది ... ఎవడికోసం వస్తుంది? మొదలుపెట్టే తీరాలి

అయితే ముందు ఎడ్రసింగ్! అదే సంబోధన ! ఏమని ఏమికానీ చాలా మర్యాదగా మంచిగా ఉండాలి, అవును అలాగే ఉండాలి సరోజాదేవిగార్కి! అంటే ? ఇంకా గారూ ఏమిటి? ఒకవైపు మన్నిస్తూ, మరోవైపు తన హృదయావేద నెలా వెల్లడించుకోగలడు? తన మనస్సులో మండిపోతూన్న అగ్నిజ్వాలల నెలా చూపించగలడు? హృదయంలో బద్దలౌతూన్న అగ్ని పర్వతాల చప్పుళ్ల నెలా విన్పించగలడు? ఉహూ! ఒద్దు అలా ఒద్దు మరి? డియర్ సరోజా ! అంటే ? ప్చ్! బొత్తిగా అంత చనువు లేదుగా? మొట్ట మొదటే చనువుగా పోతే 'రోడ్‌సైడ్ రోమియో'ల పట్టీలో చోటు చెయ్యదూ? అయినా పిచ్చిగానీ ప్రేమ హృదయాలకు చనువు లేకపోవటం ఏమిటి? ఉన్నదే అది! ఏనాడో ఆనాడు తను సరోజని చూసి న్నాడు నాడే తన హృదయం సరోజ హృదయాన్ని పెన వేసుకొంది కౌగలించుకొంది గాఢంగా ఇక చనువు లేక పోవటం ఏమిటి? పిచ్చి! వాటికి మూగ భాష తమకే అర్థం కాని విచిత్ర భాష ఉండనే ఉంటుంది అవి మూగగా మత్తుగా సంభాషించుకొంటూనే ఉంటాయి పోతే తనే బహిరంగంగా ఉత్తరం రాయటానికి పూనుకున్నాడు కాస్త చొరవ చేస్తున్నాడు అంతే! అవును! మగవాడు తను! పురుషుడు ముందడుగు వెయాలి పిచ్చి సరోజ! ఆడపిల్ల! కన్నెపిల్ల! సిగ్గు కదూ? జంకు కదూ ? అంతరంగంలో ఎంతటి వలపు దాగి ఉంటే మాత్రం ఎలా వెల్లడి చెయ్యగలదు? ఎలా? ఉహూ! చెయ్యలేదు" అలా లోలోపలే ఆరాధించుకొంటూ ఉండిపోతుంది (స్త్రీకి అప్‌లిఫ్టు ఇప్పించాలి మరి) అవును తనని చూసి పదిసార్లయినా నవ్వింది సరోజ గడిచిన ఐదు రోజుల్లో నవ్వదూ? అంతరాంతరాలలో ఆనంద ప్రవాహం సుళ్ళు తిరుగుతూ ఉరకలు వేస్తోంటే నవ్వకుండా ఉండటం సాధ్యమా ఏమిటి? ప్రేమికుల చేష్టలు వారి ఇష్టా ఇష్టాలనుబట్టి ఆగి నావవుగా? ఇంతకీ ఛ! తాను మరీ జాగు చేస్తున్నాడు ఈ ఆలోచనా ప్రపంచం ఎప్పుడూ ఉండేదే! ఆలస్యం విషం అన్నారు పెద్దలు) అసలు తనని తను గుర్తించ లేక పోతున్నాడుగానీ తనలో రచయిత కావలసిన గుణాలు చాలా ఉన్నట్టున్నాయి ఓసారి తీరిగ్గా పరిశీలించుకోవాలి గుండెని ఏదీ ? టైమేదీ వెధవది కాలేజీ చదువూ అదే సాధ సరోజ 'ఫెయిర్' చేస్తానంటే తను తప్పకుండా రచన ప్రారంభించాలి అవును సరోజ ఉంటే తప్ప కలం కదలదు

హిందీ సినీతార బొట్టులా గుండ్రంగా రూపాయి బిళ్ళలా పోగుపడుతూన్న సిరా ముద్ర నిముష నిముషానికీ కొట్ట వచ్చినట్టు కన్పడుతోంటే ఉన్నట్టుండి తృళ్ళిపడ్డాడు గోపాలం

"అరె! కాయితంమీద పెన్ను పెట్టి ఉంచేశానే! అయినా బ్లాటింగ్ పేపర్‌లా ఏమిటీ కాయితం ప్రేమలేఖకి? నయం . రాశాను గాదు" నిదానం ప్రధానం అన్నారు పెద్దలు —పెద్దలలో రెండు పార్టీలా ?) గోపాలం బ్లాటింగ్ పేపర్‌లాంటి పేపరు ఉండచుట్టి ఓ మూలకి విసిరేసి పుస్తకాం అర దగ్గరికి నడిచి నాలుగైదు తిరగేసి సర్రున ఓ తెల్ల కాయితం చించి తెచ్చుకున్నాడు "ఓ లెటర్‌పాడ్ వేయించకుంటే బావుండు" స్వగతంలో ఓ వూహ

"నా హృదయ రాణికి నా అంతర్వాణికి బావుందా ? వూహూ ! బావున్నట్టు లేదు ఏదో పిచ్చి భావ కవిత్వంలా ఉంది తను పడుతూన్న హృదయాందోళన తను అనుభవిస్తూన్న రంపపుకోత సూటిగా వెల్లడి కావటంలేదు పైగా ఈ సంబోధన ఒక్క సరోజకే గాక మరే మగువకైనా చెందేలా వున్నట్టుంది అలాగే ఉంది ఛ! తన హృదయంలో మరో పడతికి స్థానమా ? తనని ఆరాధించే సరోజ కింత ద్రోహమా ? అసంభవం ! అసాధ్యం ! వీల్లేదు చూస్తాను ఎవరడ్డొస్తారో చూస్తాను రాస్తాను చెయ్యను, ఇక లేట్ చెయ్యను"

"ప్రియ సరోజా

నేనెవరినని ఆశ్చర్యపడుతున్నావా ? ఒద్దు నేనెవరినో నీకు తెలుసు నా మనసంతా నీకు తెలుసు తరిచి తరిచి చూసుకో ! నిన్ను నువ్వు ప్రశ్నించుకో ! నీ అంతరాత్మని అర్థం చేసుకో ! సిగ్గుపడకు మొహమాట పడకు పిచ్చిపిల్లా ! నా దగ్గర నీకు సిగ్గెందుకు ?

ఒక్కసారి నీ అంతరాత్మ నడుగు మన కథంతా చెప్తుంది హృదయాల ఘోష చెప్తుంది లోలోపల జరిగే బాధ చెప్తుంది నేను నీకు ప్రాణాన్నని చెప్తుంది నేను నీకు కావాలని చెప్తుంది నన్నుదరికి చేర్చుకోమంటుంది నిజం అదంతా నిజం అంతరాత్మ నర్థంచేసుకో ! పాపం దాన్నపార్థం చేసుకోకు మన ఆత్మలు చెప్పిన మాటలు విందాం మన మనసులు వేసిన దారిన పోదాం ఎక్కడికో ఎక్కడెక్కడికో !

ఆ రోజు వెయ్యి యుగాలు క్రిందట ఏడవ తారీఖు సోమవారం సాయంకాలం సముద్రపుటంచున బీచ్‌లో సూర్యుడు అస్తమిస్తున్నాడు చంద్రుడు కూడా ఉదయిస్తున్నాడనుకున్నాను నీ మోము జూచి నీ నవమోహనాకారం నీ అందాలు గుమ్మరించే వదనం జూచి నిన్ను చూసి చంద్రుడని భ్రమించటంలో నేనేమీ పొరపడ లేదంటాను నీ తొలిచూపే నన్ను మంత్రముగ్ధుణ్ణి చేసింది నీ చిరునవ్వే నా మతులు పోగొట్టింది నీ హంసనడక నా దారి మార్చివేసింది నీ ఇలా నీగురించి ఎంతైనా రాయగలను నువ్వు రాస్తే ఏదైనా చదవగల్ను నీ గురించి పరీక్ష పెడితే నేనే ఫస్టు వస్తాను సరో నేనే !"

"టక్ టక్ " టక్కున ఆగిపోయింది గోపాలం కలం "టక్ టక్ టక్ " చిట్లింపులతో సలిగి పోయింది గోపాలం నుదురు

"రేయ్ ! నిన్నే టక్ టక్ "

త్రుళ్ళి ఎడ్డాడు గోపాలం కాయితం డెస్క్‌లో దూరిపోయింది పెన్ను మూతలో దాక్కుంది — గోపాలం చూపులు కంగారుగా గదంతా తనిఖీ చేశాయి ఠక్ ఠక్ ఠక్ ఠక్ ఠ




Vaseline
TRADE MARK
HAIR
CREAM
CHESEBROUGH-POND'S INC.
NEW YORK — BOMBAY
MADE IN INDIA

తెరుచుకున్నాయి తలుపులు !

"నీకేం బుద్ధి లేదు(టా ? ఎంతసేపు పిలవాలి ? తలుపులు బద్ధలు కొడితే ఇంటివాళ్ళూరుకో రంటావ్.... ?"

"......"

"అదేం ? అలా ఉన్నావ్ ? ఏమిటీ వేషం ? తొమ్మిది కావస్తోంటే ఇంకా లుంగీ ఏమిటి ? మాట్లాడవేంరా ? రాత్రి సెకండ్‌షో వా ?

కొద్ది నిశ్శబ్దం !.... "నాకేం బాగులేదురా !" గోపాలం నీరసం !

"ఏం బాగులేదు ? జ్వరమా ? ఎబ్బే ! ఒళ్ళు చల్లగానే ఉందే !" సన్నిహితుడి కంగారూ ! ఓదార్పూ !

"ఊహూ ! జ్వరం కాదు.. కొంచెం తల నొప్పి.. దగ్గూ — రొంప .... జలుబూ.... వడిసెం... వికారం.. దగ్గూ.... తుమ్ములూ...."

"బావుంది. మాత్ర తీసుకున్నావా ?"

"ఉహూ !"

"మందూ మాకూ లేకుండా బాధపడుతూ గదిలో పడి ఉన్నావా ? అయితే కాలేజీకి సెలవేనా ?"

"అబ్బే ! ఎందుకూ ? వస్తాను."

"ఏడ్చావులే.. ఎలా వస్తావు ఇంత నీరసంగా? ఏద మందో మాకో తీసుకుని ఇవ్వాల్టికి ఉండిపో ! ఏం మించిపోదులే."

గోపాలం మవునం !

"సరే ! నే పోతా ! సాయంత్రం వస్తాలే.. నిద్రపోకు.. అసలే..."

ధభేలున తలుపులు మూసుకున్నాయి.

"విలనంటే ఇలాంటి వెధవేను. అ(పాచ్యుడు! మూడ్ చెడగొట్టాడు. బుద్ధిహీనుడు...."

* * *

ఛ! బోర్ కొడుతుంది. కలం 'టేబుల్ మీద పడేసి ఉస్సురని నిట్టూర్చాను. రాయ బుద్ధి కావటంలేదు. ఇలా ఎంతకని పొడిగించను ? గోపాలం కాలేజి ఎగ్గొట్టాడు. భేషుగ్గా ఉంది మరి సరోజాదేవికి (పేమలేఖ పోస్ట్ చేస్తాడా ? విలన్ మార్కు (ఫెండు సాయంత్రం గోపాలాన్ని చూస్తాడా ? ఇంతకీ సరోజాదేవి గోపాలం లెటరు చదువుకుంటుందా ? ఏమో ? ఎవడికీ తెలుసు ? అదంతా టెంపో కోసం వదిలేస్తే సరి.

అయినా .... ఇలాంటి చచ్చు (పేమ కథలు రాసే అలవాటు లేదు నాకు. తలాతోకా లేకుండా— ఎన్ని పాత్రలో ఎలా నడవాలో నిర్ణయించుకోకుండా అసలు కథా కమామీషూ ఆలోచించుకోకుండా కాయితం మీద పెట్టటం సుతరామా గిట్టకపోయినా ఈ రోజు మాత్రం తప్పలేదు. (శ్రీ వారితో దెబ్బలాడిన కోపం కొద్దీ గుడ్డెద్దు చేలోపట్టు భోచనా (పపంచంలోకి—చొచ్చుకుపోయి పెక్కు మీద గోపాలాన్ని సృష్టించుకోవలసి వచ్చింది సన్నగా— బక్క పలచగా రెక్కపాయిలా ఉండే గోపాలాన్ని సృష్టించి వేస్తే నా (పమేయం లేకుండానే సము(దంలో చూసిన సరోజాదేవిని వలచి వూరుకున్నాడు — ఇలాంటి పాత్రలంటే నాకు సానుభూతి కూడాలేదు. చెప్పినట్టు వినవు సరిగదా అవి చెప్పినట్టు విన మంటాయి. నా ఖర్మ కాకపోతే ఏమిటీ కథ.. ? ఇది కథా ? కాదు— వ్యధ !

నేను బొత్తిగా తిని కూర్చుటుంన్నాననీ —

# నా డైరీలో...

అన్నీలు బాధ్యతలే మర్చిపోతున్నాననీ (శ్రీవారు వారం రోజులుగా సాధిస్తోంటే కూడా సహించాను. కాని ఉదయం ఓ రకం యుద్ధమే అయింది. మాటలు ఈ టెల్లా వదులుకోక పోయినా ఇక మొండి కెయ్యటానికి వీల్లేకుండా పోయింది—. ఇవ్వాళేదో కథరాసి— సరైన ప్లాటేదీ తోచలా నోడ్సులాంటిదేదో తీసి తిరగేశాను. ఉన్నదేవీ నచ్చలా. ఈ మాటే అంటే ఈయన ఒప్పుకోరు— "కథ నిర్మాణం వేరే ఎక్కడో ఉండదు. కంటికేది కన్పిస్తే దానిమీదోకథ రాసెయ్యటమే."

"అలాగా ? అయితే మీరే కన్పిస్తున్నారు. నా కంటికి"

"నిక్షేపంలా రాసుకో. నన్ను నాయకుణ్ణి చేసి నువ్వు నాయకివై.... ఏం ? ఇంకా సమాచారం ఏమయినా కావాలా ?"

"బాగానే ఉంది. ఆ రాసింది కాస్తా మనమే దాచుకోవచ్చు."

"ఇన్సల్ట్ ! అవమానం ! మహావమానం !.... రాయటం నీకు చేతకాదను. నువ్వు రాసి ఒప్పించలేవను. అంతే."

"పోనీ అంతే. నాకేం కథ దొరకటం లేదు."

"అదేం కుదరదోయ్. కథ మాట మళ్ళా ఎత్తకు అన్నీ కవితా వస్తువులే అన్నాడొకాయన."

"అనొచ్చు. అన్నది నిజమూకావచ్చు. కాని అది నాకు సరిపడదు. కనపడ్డ (పతిదానిమీదా నేను రాయలేను."

"నాకు తెలీకడుగుతానూ ఏమిటి నీకింత పిచ్చి ? అదిగో ఆ నేలమీద చీమని చూడు. మహా కష్టపడి బియ్యం గింజ లాక్కుపోతోంది — చూశావా ? అప్పుడే మరో చీమ ఎదురొస్తోంది. బియ్యంగింజ కోసం. ఆ రెండు చీమలకూ యుద్ధం ! అ(కమయుద్ధం చైనా యుద్ధం ! పోనీ ఇటుచూడు ! నానిగాడి చేతిలో బిస్కట్టు కోసం పాప ఎలా ఎగిరెగిరి పడుతోందో ? అర్థమైందా ? ఎక్కడ చూసినా ఇదే సమస్య ! స్వార్థం ! స్వార్థం ! తగని స్వార్థం ! ఈ స్వార్థం గురించి ఇవ్వాళో కథ రాయలేవూ ?"

నేను విసుక్తుబోతూ బుగ్గన వేలు పెట్టుకున్నాను— "పోనీ మీరే ఎందుకు రాయకూడదు ?"

"ఏదీ ? టైమేదీ ? లేకపోతే అదేం (బహ్మ విద్యా ? నేను కలం చేతిలోకి తీసుకున్నానంటే అలా అలా పరిగెత్తాల్సిందే ?"

"ఎవరూ ? పాఠకులా ?"

"కాదోయ్. పేజీలు. అసలు నేను ఎన్నో ఉద్(గంథాలు......"

"రాద్దా మనుకొంటున్నారా ?"

"కాదు. ఉన్నాయ్."

"అలిఖితంగా. అవునా ?"

"ఎలాగో ఓలా — (పస్తుతం నేను రామాయణం రాద్దా మనుకొంటున్నాను."

"ఎందుకూ ? వాల్మీకి రాశాడుగా ? మహా మహా పండితులు తెనిగించారు కూడాను. మళ్ళా మీరు...."

"అదంతా పెద్దవాళ్ల విషయంలే. నీ కర్థం కాదు .... అసలు నేను ఎన్నో నవలలు రాయాలనుకునే వూరుకుంటున్నాను—"

"ఎందుకనీ ?"

"నీలాంటి చిన్నవాళ్ళు. కొత్తగా ఫీల్డులోకి వస్తూన్న వాళ్ళు దెబ్బతినిపోతారని .... ఆలోచించి."

"ఆహా ! ఎంతటి త్యాగం ! అయితే నేనివ్వాళ త్యాగం గురించి కథ రాస్తాను."

"రాస్తావా ? నిజంగా రాస్తావా? నా త్యాగం గురించే రాస్తావా ?



"రాస్తాను.... రాయాలనుకొంటున్నాను గాని ఇలా రాయబోతే...."

"ఇంతకీ మూడ్ రాదంటావ్. అవునా ?"

"ఆ. అంతే మూడ్ రాకపోతే ఎలా ? అదేం పంపులోంచి నీళ్లు వచ్చినట్లు వచ్చేస్తుందా ఏమిటి ? ఈ వేసవిలో నీళ్లు కూడా రావటం లేదే !"

# నా డైరీలో...

"ఓహో ! ఇదంతా నా దగ్గరా ఏమిటి ? ప్రయత్నం పాడూ లేకుండా హాయిగా పడుకుని నిద్దరోతోంటే రావటం ఏమిటి ?.. కాస్త ఒళ్లు వంచి కలం చేతిలోకి తీసుకుని కూర్చుంటే మూడ్‌గీడ్ చచ్చినట్టు వచ్చి తీరుతుంది. తెలిసిందా ?"

నాకు ఉక్రోషం వచ్చింది— "నేనేం హాయిగా నిద్దర పోతున్నానని మీరు బెంగెట్టుకోకండి. ఎంతసేపూ రాతలూ కోతలే గానీ ఇంటిపనుల్తో పిల్లలతో ఎలా చస్తున్నానో మీకేం అక్కర్లేదు. ఆ మధ్యాన్నం పూట పోనీ కాస్సేపు రాద్దామా అంటే పుత్రికామణి నంగిరి గీతం.... ననన్న... గగగ్గ.. అంటూ."

"పాప ఏడుస్తోందంటావ్ ? అంతేనా? ఏడవనీ ! ఏడ్చి ఏడ్చి అదే వూరుకుంటుంది. ఛైల్డ్ సైకాలజీ నీకు తెలీదు."

"తెలీకపోతే పోనీండి. అసలు పాప ఏడుస్తుందని ఒప్పుకున్నారుగా ? మరి అది కాళ్ల దగ్గర కూర్చుని "గీ"మని ఆలాపన చేస్తోంటే నేనెలా రాసుకునేది ?"

"సందేహం లేదు. నువ్వలా చదవాలనుకోలా? సారీ ఆ మాటెప్పుడూ అడగద్దన్నావు కదూ ? సరే ! అయితే పాప అస్తమానూ ఎందుకేడుస్తోందబ్బా ?" ఓ క్షణం ఆలోచన !— "నువ్వు జోలపాట లేవో పాడుతూన్నట్టున్నావ్. అవునా?"

"మీ బాత్ రూమ్ సంగీతం కన్నా నయమే లెండి."

"అదీ సంగతి. మరి ఇన్నాళ్లు చెప్పవేం ? ఇవాళ పాలుపట్టి పడుకోబెట్టి వూరికే జోకొడుతూ.... ప్లీజ్ !"

నేన్మ ఫక్కుమని నవ్వేశాను— "మీరు ఎన్నయినా చెప్పండి. నేను రాయను. విశ్రాంతి మానుకుని.... పిల్లల్ని ఏడ్పించుకుని.... వెధవ బాధలన్నీ పడిరాస్తే వచ్చేదేమిటి ? నా మొహం ! ఆ పత్రికల వాళ్లు ఉత్తరం రాస్తే జవాబైనా ఇవ్వరు. ఖర్మగాని అచ్చువేస్తే వాళ్లిచ్చే పారితోషికం పెట్టుబడి ఖర్చుకేనా చాలదు. ఎందుకా యాతన? ఇకమీదట నేనేం రాయదల్చుకోలేదు."

"ఏదో శాస్త్రం చెప్పినట్టుంది నీ అలక."

"మీ శాస్త్రాలకేం గానీ నేను రాయను. ఎందు కొచ్చిన రాతలు?"

శ్రీవారికి కాస్త కోపం వచ్చింది—

"ఇంతకీ ఇలా కబుర్లతో కాలం గడిపేస్తావా ? ఏదైనా ప్రారంభిస్తానంటావా ? మధ్యాన్నానికి ఏదైనా కొత్త వ్యాసం ప్రారంభించి చూపిస్తేనే గానీ నేను అన్నంతినను."

"మానండి. మీరు అన్నంతినక పోతే నాకేం నష్టం ? నేను తినచ్చుగా ?"

"చెప్పాల్సింది చెప్పేశాను. తర్వాత నీ ఇష్టం."

"బాగానే ఉంది. బలవంతంగా రాయిస్తే బాగానే తగలడుతుంది."

"తగలడనీ ! రెండుసార్లు తగలడ్డా మూడోసారి బాగుపడుతుంది. అయినా నన్ను తిట్టు కొట్టు— డిక్టేటర్‌లా ఉన్నానని అపోహపడుతూ నాలాంటి వాణ్ణెవణ్ణో సృష్టించకు ఖర్మ !"

"నిజంగా మీరు అన్నం మానేస్తారా ?"

"శ్రీవారి సంగతి నీకు తెలుసు."

"బాగానే ఉంది. బాపూజీ తత్వం మీకు బాగా వంట బట్టినట్టుంది."

"ఆఖరి మాట చెప్తున్నాను. నీ ఇష్టం. నీ కెలా తోస్తే అలా చేసుకో నా గురించి మాత్రం ఆలోచించకు."

చిలికిచిలికి గాలివానే అయింది. శ్రీవారికి

పెంకితనం జాస్తీ ! అన్నమాట నిలబెట్టుకోక పోతే అభిమాన లోపం ! మరి నా ఒక్కదానికే వంట చేసుకోనా ? ప్ప్ ! లాభంలేదు కాస్త ఇంట పనులు తొందరగా తెములుచ్చుకోవాలి

వంట కాగానే బట్టలుతుక్కున్నాను ఉదయం ఎప్పుడో పని మనిషి తుడిచి పోయిన గదులు మరోసారి తుడుచుకుని పాపకు నీళ్ల పోసే ప్రయత్నంలో వడ్డాను అంతలో ఎదరింటావిడ వస్తూనే కుంపటి దగ్గర విసనకర్ర చూస్తూ—

"ఏమిటి వదినా నీకు మరీ బద్ధకం— విసన కర్ర ఇలా చినిగి పోకుండా గుడ్డవేసి అంచు కుట్టుకో కూడదూ ?" అంది

నాకు చిరాకు వేసింది ఆ ఎదిరింటి ఆడ బిడ్డ ఎప్పుడు వచ్చినా ఏదో ఒక వంక పెట్ట కుండా వెళ్లదు ఉతికి ఆరవేసిన చీరమీద మరకలే పోలేదంటుంది కోసి ఉంచుకున్నం కూర ముక్కలు పెద్ద వయ్యా యంటుంది పిల్లల్ని సముదా యించటం రాకనే ఏడుస్తూంటారంటుంది తను ఒక్కతే నూటికి నూరుపాళ్లు ఉత్తమ ఇల్లాలైనట్టు నటిస్తుంది — నా చిరాకు అణచు కుంటూ— "అర్థణా విసనకర్రకి గుడ్డకుడుతూ కూర్చుని అరగంట పాడు చేసుకోనా ? పోనిద్దూ! వెధవ విసన కర్రలకేం భాగ్యం ?" అన్నాను అతి శయంగానే— "ఇంతకీ నువ్వు పనిమీద వచ్చావా? కూర్చో కాస్సేపు" అన్నాను అభిమానంగా

"అబ్బే ! పోతాను ఓ గిన్నెడు పంచదార ఇద్దూ ! నిన్న తెప్పించటం మర్చిపోయాను" అంది నసుగుతూన్నట్టు

నేను నవ్వుతూ సన్న సన్నగా అంటించేశాను "తమ తప్పు నెరిగినవారు తప్పు లెన్నరు అంతేనా? అస్త మానం నీకీ మతి మరుపేమిటి ? మరెవ వరికైనా ఐతే ఓ ఉపన్యాసం దానివే కదూ ?"

"అబ్బో ! నీకు కోపం వచ్చినట్టుందే ! మరె ప్పుడూ అనములే నిన్ను పంచదార తీసుకురా ! పోతాను"

గిన్నెడు పంచదారతో సంభాషణ ముగిసింది

పాపని పడుకోబెట్టి నానిగాడికి అన్నం పెట్టాను వాడు అన్నం తింటోంటే తలదువ్వుకొని బొట్టు పెట్టుకున్నాను

చెప్పొద్దూ ! వాతావరణం కాస్త అనుకూలం గానే ఉంది పాప నిద్రపోతోంది నానిగాడు బొమ్మలు చూసుకుంటున్నాడు ప్లాట్ లేకుండా ప్రారంభించిన నేను ఏదో రాసేశాను

గోపాలం సరోజని ప్రేమిస్తున్నాడు ఉత్తరం కూడా రాశాడు గతమంతా కొంతసేపు సింహావ లోకనం చేసుకుని గంట చూశాను

పన్నెండుకి పదినిముషాలు ! ఫర్వాలేదు— మళ్లా కలం తీసుకున్నాను

* * *

హాయిగా పడుకుని డిటెక్టివ్ నవల చదువు కొంటూన్న సరోజ లేడీలా ఠీంగున గెంతి బామ్మ చేతిలో ఉత్తరం లాక్కుంది అటూ ఇటూ తిప్పి చూసింది

"ఎక్కణ్ణుంచే ?"

"అదే చూస్తున్నాను"

"ఇంటి దగ్గిర్నుంచి కాదూ"

"వూహూ ! ఫ్రెండెవరో రాసినట్టుంది"

"ఏమిటో చదువు వింటాను"

అందమైన సరోజకళ్లు మిలమిల్లాడుతూ చురుగ్గా ఉత్తరంలో బారుల వెంట పరుగెత్తుతుంటే రాబోతూన్న నవ్వు క్రింది పెదవి కొరుక్కుంటూ అతి బలవంతం మీద ఆపుకొంది

"ఏమిటే విడ్డూరం ? ఏం ఉంది అందులో?" అఖండురాలు బామ్మ !

"ఓ స్నేహితురాలు గమ్మత్తుగా రాసింది బామ్మా! నేనంటే చాలా ఇష్టంట నన్ను చూడాలని ఉందిట ఇంకా ఏమోమో రాసిందిలే"

"పిచ్చి తల్లి ఎవరే అది ?"

"చెప్తాలే తర్వాత" సరోజ పరుగులో గది లోకి వెళ్లిపోయింది

"గోపాలం ! మరో పిచ్చివాడు" నవ్వు కొంది చిన్నగా అలా అలా అరమోడ్పు కన్నులతో ఆలోచించింది ఓక్షణం— "పాపం గోపాలం .."

* * *

కెవ్వుమంది పాప ఉలిక్కి పడ్డాను పెన్ను పారేసి పరిగెత్తాను గుక్కపట్టి ఏడుస్తూన్న పాపని గుండెలకు హత్తుకున్నాను

ఒకావిడ పోలీసు స్టేషనుకి వచ్చి "నేను మా వారిని చంపే శాను—ఐతే ఆత్మరక్షణార్థమే యిలా చేశాన"ని చెప్పింది.

"అదేమిటీ?" అడిగాడు పోలీస్ అధికారి

"మరే! నే నాయన కేసి రివా ల్వర్ చూపించాను అది లాక్కుని నన్నాయన చంపేస్తా నన్నారు. అంతే నే పేల్చాను"

"ఏమ్మా ? ఏమైందే ? కలొచ్చిందా తల్లీ ? పోనీలే వూరుకో" అంటూ— నానిగాడు నంగ నాచిలా దాక్కున్నాడు తలుపుచాటున

"ఏం చేశావురా చెల్లిని ?" అన్నాను అను మానంగా

వాడు భయంభయంగా— గొణిగాడు— చేతిలో చీపురుపుల్ల చూపిస్తూ— "ఇంజీసనే"

ఒక్కటి అంటించాను కోపంగా— "కోతి వెధవా ! అది చక్కగా నిద్రపోతోంటే చీపురు పుల్ల పెట్టి గుచ్చుతావా ? ఇంజీసనా నీ మొహ మూనూ"

వాడు ఏడవలేక బిక్క మొహం వేసుకు నించు న్నాడు

"అల్లరి వెధవా ! చెల్లి డాక్టరై నీకే ఇంజ క్షన్లు చేస్తుంది చూడు పెద్దయ్యాక"

"చెల్లేంకాదు నేనే డాట్టరు" ఉక్రోషంగా అరిచాడు వాడు

"నువ్వేంకాదు చెల్లే నువ్వు రణిస్తావ్ ! లా చదువుకో."

"నేను నీతో మాటాన్ను" వాడి ఆఖరి అస్త్రం అది

"నాతో మాట్లాడవూ ?"

"ఊహూ ! మాటాన్ను"

"మరెవరితో మాట్లాడుతావు ?"

"నాన్నతో మాట్లాడుతాను"

"ఇంకా ?"

"చెల్లితో మాటాడుతాను"

"అయితే నాతో మాట్లాడవన్న మాట"

"ఊహూ ! అసలా మాటాన్ను"

సైకిల్ బెల్లు వీధిలో విధి విరామం లేకుండా మోగుతోంది

"వస్తున్నా వస్తున్నా" అంటూ తలుపు తీసేంతలో శ్రీవారి భీకర కటువచన ప్రవాహం "ఎంతసేపు పిలవాలి ? ఎండలో చస్తుంటే వెంటనే తలుపులు తియ్యాలని తెలీదూ ? ఏమి టంత రాచకార్యం లోపల ?"

"ముందు లోపలికి రండి ఎండలో నిలబడి దెబ్బలాడకండి"

"పైగా దెబ్బలాడుతున్నానంటావ్ నువ్వు మనిషివేనా అని"

"అదేమో నాకు తెలీదు నేను మీభార్యనంతే"

"ఊ మాటలు నేర్చావ్"

"మీ దగ్గిరే మరి"

"చాల్లే వూరుకో" లుంగీ కట్టుకుంటూ స్నానాలగదిలోకి నడిచారు మావారి కోపం కొన్న పాలపొంగు లాంటిది ఎండుటాకుల మంటలాం టిది బొత్తిగా తొందరెక్కువ — అంతలోనే పశ్చాత్తాపం ! క్షమార్పణలూను బాత్‌రూంలో కోపం కడుక్కుని ఆయన బయటికి వచ్చేసరికి మా జ్యేష్ఠుడు నా మీద ఫిర్యాదు పత్రం తయారు చేసుకునించున్నాడు — "నాన్నా ! అమ్మతో నేమాటాన్ను నన్ను తిట్టింది మాట్లాడకు నేనూ మాటాడను. మన మిద్దరమే జట్టు"

"అయితే నానీ! నీకు కథలెవరు చెప్తార్రా ?" నా సందేహం !

"నేనే చెప్తా(నా ?" మా వారి అభయం !

"నాన్నే చెప్తుతాడులే" మావాడి ధైర్యం !

"మరి చెల్లి ఎవరి జట్టు ?"

"మాజట్టే నని చెప్పు"

"మా జట్టేనమ్మా !"

"అన్నం వడ్డిస్తావా ?"

"అదే అడుగుతున్నాను ఏం ? వడ్డించక వస్తు ఉంచుతానా ?"

"అయితే ఏదో ఆర్టికల్ ప్రారంభించావన్న మాట గుడ్ ! చాలా మంచిదానివి"

"మీ మెచ్చుకోలేం అక్కర్లేదు"

"మెచ్చుకోలు కూడా అక్కర్లేనంత మంచి దానివి"

"పొగడ్తలకేం గానీ నాకేం జాబు రాలా ?"

"నాలుగో—ఐదో !—నా ఫ్రెండ్ దగ్గిర్నుంచొక కవరు వచ్చింది గానీ కాస్త రిప్లయిచ్చేద్దూ !"

"అదేం కుదరదు ఖాళీలేక నా ఉత్తరాలకే నేను జవాబు లివ్వటంలేదు ఇక మీదట మీ ఉత్త రాలేగి నేను గాయాదలుగా నేను"

"అలా అంటే ఎలా ? ఈ ఒక్కసారికి .. ప్లీజ్ !"

"ఇలాంటి ఒక్కసార్లు ఇరవై అయ్యాయి"

"ఇరవై ఒకటోసారి కూడా అయితే "

"పిల్లేదు నేనేం మీ సెక్రటరీనా ?"

"ఛ ! సెక్రటరీ ఏం ఖర్మ ? నా భార్యవి.. అర్ధాంగివి నా హృదయానివి— హృదయేశ్వరివి జీవితానివి. జీవితేశ్వరివి నా "

"ష్ ! రామరావు ! ఏమిటి సొద ? చాలు వూరుకోండి"

"వూరుకుంటాను ఒక్కటి చెప్పు నా కష్ట సుఖాలు నీవికావూ ? నా ఉత్తరాలు రాయలేవూ?

"భగవంతుడా ! ఈయన "

# నా డైరీలో...

"పతియే ప్రత్యక్ష దైవం లన్నారు కాదూ?"

"ఎవరూ ? సినిమా వాళ్ళేనా ?"

"ఏమో ! ఎవరో ! గుర్తులేదు."

"ఉండదు. ఎలా ఉంటుంది ? ఇదిగో చెప్తున్నాను. ఇది ఆఖరి వార్నింగ్— ఈ ఒక్క సారికి రాస్తాను. మరెప్పుడూ...."

"థాంక్స్ డియర్ ! థాంక్స్ ! ఒద్దు. మరెప్పుడూ రాయొద్దు. ఇక నిన్ను డిస్టర్బ్ చెయ్యనుగా !"

"ఓ మోట సామెత నాకు గుర్తు వస్తోంది. చెప్తే ఉడుక్కుంటారేమో !"

"నే నంత విరసుణ్ణనుకున్నావా ? ఏమిటో చెప్పు విందాం"

"ఓ వూరకుక్క దాలిగుంటలో పడుకుంటే"

"తెలుసులే వూరుకో అయితే కుక్కతో నన్నా"

"ఛ ! పోల్చలేదండీ మిమ్మల్ని. అందుకే అభయం తీసుకున్నాను."

"బ్రతికావు పో !"

"ధన్యురాల్ని. ఇంతకీ వంటకాలెలా...."

"...ఉన్నాయంటావ్? వంటకాలకేం ? బ్రహ్మాండంగా ఉన్నాయి. ఆ మాటకొస్తే బ్రహ్మాండం బద్దలయ్యేలా ఉన్నాయ్. జనాభా అతిగా పెరిగిపోతూన్న ఈ తరుణంలో ప్రతిస్త్రీ నీలా వంట చెయ్యగలిగితే.... ఏం ? అలా మూతి ముడుచుకున్నావ్ ? పూర్తిగా చెప్పనియ్."

"ఏం అక్కర్లా. మాట్లాడకుండా తిని లేవండి"

"హత్తోస్మి."

ఓ ఐదు నిముషాలు దారుణమైన నిశ్శబ్దం ఇల్లంతా రాజ్యం చేస్తే బావుండుననిపించింది గానీ పిల్లలిద్దరూ.... ప్చ్ ! లాభంలేదు.

"నాన్నా ! డబ్బియ్యవ్." నానిగాడు వాళ్ళ నాన్న వెంట పడ్డాడు జారిపోతూన్న లాగు ఎగలాక్కుంటూ.

"విశ్వ ప్రయత్నం చేసి నేనే ఓ అణా సంపాదించుకున్నారా చిట్టి తండ్రీ ! ఇందులో నీకూ వాటా? దారుణం." అంటూనే ఓ నయాపైసా వాడి చేతిలో వేశారు. వాడి సంతోషం వర్ణనాతీతం"

"మరి నాకు నయాపైసా తక్కువైందీ'

"బావుంది. నన్నేం చెయ్యమంటారు. రోడ్ల మీద వెతుక్కోండి."

"ఇంట్లోంచే మొదలు పెడతాను."

"ఇంట్లో నయాపైసా లేదు. ముందు బైటికి వెళ్ళండి. నే రాసుకోవాలి."

"మరి కిళ్ళీ ఎలా వేసుకోనేం ?"

"అసలు కిళ్ళీ ఎన్ని పైసలో ?"

"ఆరు. లేకపోతే అణా !"

"ఏంకాదు. ఐనా మీ దగ్గర ఎన్ని డబ్బులున్నాయో నాకు తెలుసుగానీ వెళ్లిరండి. ఆలస్యమవుతోంది."

"ఒక్కపైసా అడిగితే ఇవ్వావుకాదు. పోనీ నీకే పాపం."

"ఫర్వాలేదు."

శ్రీవారికి చాలా ఉక్రోషం వచ్చింది. సైకిల్ దగ్గిర ఆడుకుంటూన్న నానిగాడికేసి ఉరిమి చూస్తూ— "ఒరేయ్ నువ్వెళ్లి పడుకో ! ఎండలో ఆడావంటే ఒళ్ళు హూనం చేసేస్తాను వూ పడుకో." అంటూ గర్జించారు. నాకు నవ్వొచ్చింది. నానిగాడు మాత్రం పిల్లిలా గదిలోకి నడిచాడు.

"అయితే నేను పోతున్నాను."

"అవశ్యం ! పోయిరాండి."

శ్రీవార్ని సాగనంపి తలుపులు వేసిలోపలికి వచ్చేసరికి నానిగాడు పక్కమీద లేచికూర్చుంటూ అడిగాడు— "అమ్మా ! నాన్న వెళ్లిపోయాడా ?"

"ఏం ఎండలోకి పోయి గంతు లేద్దామనా ? అల్లరివెధవా ! నిద్ర రాకపోతే చెల్లిని ఆడిస్తూ కూర్చో— మంచం దిగు" అంటూ లక్కపిడత లబుట్ట పిల్లల ముందు గుమ్మరించాను

(ఇంకా వుంది)

ఎమ్మైల్ 'హార్సెల్స్'కి బయలు దేరాడు కారులో ఆ బస్సును వెంబడించాడు.

జాన్ బవెర్స్ బస్సు ఆపి డబ్బుతో నిండిన తోలు సంచి డ్యూటీలో ఉన్న వాచ్‌మన్ (కాపలా దారు)కి ఇవ్వబోతున్న సమయంలో హెన్రీ ఫ్రికోర్ట్ అతన్ని ఢాం— ఢాం అని రెండు సార్లు కాల్చాడు. ఉత్తర క్షణంలో ఆ సంచితో సహా దుష్టత్రయం తమ కార్లో అంతర్థానమై పోయారు.

బావెర్స్‌కి బాగా గాయాలు తగిలాయి. ఆసు పత్రిలో ఓ వారం రోజులు తీసుకుని మరీ చని పోయాడు. చనిపోయేలోగా స్పృహవచ్చి తనను కాల్చిన వారి పోలికలు, ఆనవాళ్ళు, రూపురేఖా విలాసాలూ వివరించాడు. ఆనక మేము వాళ్ళని పట్టుకున్నాక అతను చెప్పిన ఆనవాళ్ళతో పోల్చి చూసి నిశ్చయం చేసుకున్నాము.

* * *

నేరస్థులనైతే పసిగట్టాము కానీ ఋజువులు లేవు కదా ! ఏది ఏమైనా ఎమ్మైల్ బూాయిసన్‌ని మాత్రం చస్తే వదలకూడదని నిశ్చయించుకున్నాను.

* * *

ఎమ్మైల్ తన గ్యాంగుతో ప్యారిస్ నగర సరిహద్దు ప్రాంతాల్లో వివెక్స్ అనే చోట దాక్కుని ఉన్నాడని నాకు (1950 మే, నెలలో) తెలిసింది. మా ముఠా అక్కడికి చేరే సరికి తలుపులు అవీ మూసి ఉన్నాయి. మా వాళ్ళు గోడలు గెంతి లోపలకు ప్రవేశించారు.

ప్రాంకోయిస్ గుయిలో అనే (గ్యాంగు వ్యక్తి) అతన్ని కిటికిలోంచి మా పోలీసు ఇనస్పెక్టర్ విగోరెక్స్ కనిపెట్టి 'బయటికిరా' అని హెచ్చరించాడు. కాని, అతడు రానందున కాల్పులు, ప్రతి కాల్పులు ప్రారంభమయ్యాయి. ఈ సందడిలో ఎమ్మైల్ చక్కగా, చల్లగా జారుకున్నాడు.

మరో సారి ఎమ్మైల్, అతని సోదరుడు జాన్ బాప్టిస్ట్ బొటానికల్ గార్డెన్స్ (వృక్ష శాస్త్రానువుగా పెంచిన వనము)లో కనబడ్డారు. అనుకోకుండా వాళ్ళని చూడడం వల్ల పోలీసులు ఖంగారుపడి చిందులు తొక్కారు. ఎమ్మైల్ సోదరులు నేర్పుగా మాయమై పోయారు.

* * *

బోయిస్ డి బెల్గాన్ అనే చోట ఎమ్మైల్ ఉంటున్నాడని అతనిచేత మోసగింపబడిన ఓ వెరయాలు మాకు తెలియ జేసింది. వెంటనే ఆ ఇంటి మీద దాడిచెయ్యమనీ, బల ప్రయోగం చెయ్యమనీ, టియర్‌గాస్ (భాష్పవాయువు) వదలమనీ నాపై అధికారులు చెప్పారు. కానీ, ఎమ్మైల్‌ని పట్టుకునే విధం అదికాదు. ఇంత గొడవచేస్తే తీరా అతను చనిపోవచ్చు. అతన్ని ప్రాణాలతో పట్టుకోవాలి, పట్టుకుని తీరాలని నా చిరకాల వాంఛ ! !

కనుక అతనింటికి కాపలా ఉండి, అతను బయటికి వచ్చేవరకూ నిరీక్షించాను. 1950 జూన్ 10— ఆ వేళ నాకు పర్వదినం— ఆ నాడు తెల్లవారుతూనే ఎమ్మైల్ బయటికి వచ్చి అటూ ఇటూ చూసి, దగ్గరలో ఉన్న అడవుల వైపు వెళ్ళబోయాడు. మధ్యలో ఓ అరగంట ఆగి ఏదో ఆలోచించుకున్నాడు. బహుశా కొడక్ ఫోటో ప్లాంట్' కాజేసే విధానం ఆలోచించుకుని ఉంటాడనుకున్నాను.

# సింహస్వప్న నాయకుడు

27 వ పేజీ తరువాయి

ఆనక చొక్కా కాలరు సరిచేసుకుని, చకచక 'త్రీషెల్స్' హోటలు వైపు నడిచాడు. అతను బార్‌లోకి వెళ్ళేసరికి నేను చెంగున రోడ్డుదాటి మరో చిన్న హోటలు కెళ్ళి నా అసిస్టెంటు ఇనస్పెక్టర్ గిల్బర్ట్, ఇనస్పెక్టర్ బ్రాన్కీలకు ఫోను చేసి వెంటనే రమ్మన్నాను.

వాళ్ళొచ్చేవరకూ ఓ చెట్ల గుబుర్లో దాక్కుని వెయ్యి కళ్ళతో నిరీక్షించాను. వాళ్ళు నల్లటి, చక్కని ట్రైయోంఫైన్ కారులో వచ్చారు. ఆ కారు పారిస్ మోటారు రూమ్ నుంచి తెచ్చారు. ఇనస్పెక్టర్ బ్రాన్కీ తన అందమైన భార్యను కూడా వెంట పెట్టుకుని వచ్చాడు. ఆమే— ఇంగ్లీషువారిలో ఛాయ తక్కువగల, అందమైన స్త్రీ ! !

వాళ్ళు ముగ్గురూ హోటల్లో ప్రవేశించారు. నేను ఫోనులో 'ఆంద్రీ కావాల'ని ఆ హోటలుకు ఫోను చేశాను. ఆ పేరుతో పిలవగానే ఫోను వద్దకు వెళుతున్నట్టు వెళ్ళి 'అతన్ని' పట్టుకోవాలని మొదట ఫోనులో చెప్పాను. టెలిఫోను గణ గణ నాకు 'విజయభేరిగా' వినిపించింది. ఏకైక శత్రువు, నా పాలిట 'సంకటం' అయిన ఎమ్మైల్ చేచిక్కినంత ఆనందించాను. ముప్పై మూడు నెలల నిరవధిక శ్రమ ఫలించింది. ఎమ్మైల్‌ని నాచేతో నేను మూడోసారి బంధించ బోతున్నానన్నమాట ! ఈ సారి ఘన విజయం నాదే ! నన్నే చివరికి విజయం వరించింది.

ఆ రాత్రి నేను నిబ్బరంగా హాయిగా గాలి పీల్చి ఫ్రాన్స్ మొత్తాన్నీ గడగడలాడించిన కిరాతకుడు ఎమ్మైల్ బూాయిసన్ నావల్ల కటకటాలకు లోపల ఉన్నందుకు మహదానందం పొందాను. ఆ రాత్రి నిశ్చింతగా, తెల్లారితే ఏమౌతుందో నన్న భయం లేకుండా పడుకోవచ్చు. తెల్లారితే అని బాధపడ నక్కరలేదు.

* * *

అతని ఫైలు సంపూర్ణం చేసి, "అయిపోయిన కేసులు" అనే ప్రత్యేక స్థలంలో పెట్టేసి, నా నోట్ పుస్తకం డ్రాయరు అట్టడుగున పారేశాను.

ఫ్రాన్స్ నిశ్చింతగా గాలి పీల్చింది.

అతని గ్యాంగును పట్టి, అతని కేసులన్నీ విపులీకరించి అతనికి శిక్ష నిరయించడానికి నాలుగు సంవత్సరాలు పట్టింది.

సాయుధ బలగాలతో దోపిడి చేసిన వారికి 'మరణ శిక్షణ' విధించడం ఫ్రెంచి న్యాయ శాస్త్రంలో ఉంది. ఎమ్మైల్ బూాయిసన్ హింసా కాండల పట్టికవిని, ఫ్రెంచ్ కోర్టు హడలిపోయి, తక్షణం అతన్ని ఉరితియ్యండి — గండ్ర గొడ్డలితో నరికించండి అని శిక్ష విధించింది. డబ్బు తీసుకు పోతున్న వారిమీద విరుచుకు పడి, గాయ పరచి, చంపిన నేరం మీద బూాయిసన్‌కు ఆ శిక్ష వేశారు.

మరొకసారి తీర్పుచేసి, అతనికి నాలుగు విధాల యావజ్జీవ శిక్ష విధించారు. ఒకటి— ఇరవై అయిదు సంవత్సరాల శిక్ష, మరొకటి పదిహేను సంవత్సరాల శిక్ష — ఆనక మరణ శిక్ష)

ఎమ్మైల్ మరణ శిక్ష తగ్గించమని కోరుకోవచ్చని రిపబ్లిక్ ప్రసిడెంటు సమ్మతించినా, యాభై ఏళ్ళ పైబడిన ఎమ్మైల్ బూాయిసన్ ఆ శిక్షలన్నీ అనుభవించే వరకూ ఎలాగ బ్రతకడు— జైలు గడి దాటనేలేడు మరొకసారి విజృంభించ గలిగే శక్తి కూడా అతనికి లేదు. ★










# మెరకచేను

19 వ పేజీ తరువాయి

అన్యథా భావించను. నీ మనస్సు నాకు తెలుసు. నీ అవసరం నాకు తెలుసు. నీ పరిస్థితులు నాకు తెలుసు. పోనీ, ఒకపని చేయగూడదూ! ఈ మెరకచేను అమ్మడం మీ అబ్బాయి చదువు నిమిత్తమే గదా! ఓ అయిదువేలు ఇస్తాను—చేబదులుగా. వడ్డీ వద్దు. నోటు కూడా వద్దు. మీ అబ్బాయి చదువు పూర్తి అయినాక, సంపాదనలో తీర్చు. ఆపదలో ఆదుకొనడం కంటె స్నేహధర్మమేముంది ? ఈ పద్ధతే మెరుగ్గా ఉంటుంది. మెరకచేనుమీద నీకున్న మమకారం నాకు తెలియనిది కాదు. ఇప్పుడు నువ్వు మెరకచేను అమ్మితే—మళ్లీ రేపు డబ్బులు మెదిలాక కొనాలంటే ఎవరమ్ముతారు ?''

వెంకటకృష్ణయ్య మంచితనానికి, అమూల్యమైన సలహాకు, ఉదార స్వభావానికీ రామసుబ్బయ్య దిగ్భ్రమ చెందాడు. మనస్సులో చేతులెత్తి దణ్ణంపెట్టాడు. కాని పైకి మొహమాటాన్ని కనబర్చాడు. అభిమానం అడ్డువచ్చినట్లు నటించాడు. ముఖాన్ని చిన్నబుచ్చుకున్నాడు.

వెంకటకృష్ణయ్య చొరవతీసుకొని, నచ్చజెప్పాడు. చివరకు రామసుబ్బయ్య అయిదువేలు చేబదులుగా పుచ్చుకునేందుకు అంగీకరించి, మెరకచేను అమ్మకం మానుకొనేందుకు నిశ్చయించుకున్నాడు. ఆయన మనస్సు గోగుపుల్లకంటె తేలికపడింది. దీపాలు పెట్టాక హుషారుగా ఇంటికి వచ్చి వంటగది ప్రక్క మెరాబాలో పొయ్యిగడ్డ ముందు గంజి వారుస్తూన్న భార్యతో కాయించి అన్నాడు రామసుబ్బయ్య.

''మెరకచేను అమ్మటంలేదు.''

లాటరీలో లక్ష రూపాయలు వచ్చినంతగా సంభ్రమాశ్చర్యచకితయ్యింది లక్ష్మీకాంతమ్మ. మసిగుడ్డతో అన్నపు కుండను గట్టిగా పట్టుకొనే ''ఏం ?'' అన్నది నుదురు వెడల్పుచేస్తూ.

వెంకటకృష్ణయ్య చేస్తానన్న సహాయాన్ని సంతోషంతో వివరించి చెప్పాడు.

కూర మాడిపోయినట్లు పెదవి చప్పరించి, ముఖం మోటుగా చిట్లించింది లక్ష్మీకాంతమ్మ.

''ఓస్! ఇదా మీ సంబడానికి కారణం! ఏదో సామెత చెబుతారే! .... చెరువులో గేదె కొమ్ముల్ని చూసి కడుపు నింపుకున్నాట్ట! వెంకటకృష్ణయ్య చేబదులుగా అయిదువేలిస్తాడట ..... వడ్డీ లేదుట ..... నోటు అక్కర్లేదట ..... ఈయనగారు చంక లెగురవేసుకుంటూ వచ్చారు. ఆయన సహాయం వెనుకనున్న స్వార్థాన్ని పసికట్టారా ? లేదు. అబ్బాయి చదువుకు ఇప్పుడు అయిదువేలిచ్చి—పెద్ద ఆపదలో ఆదుకున్నట్లు, రేపు తన కూతుర్ని పెళ్లి చేసుకోమని గొంతుమీద కూర్చుంటాడు. అప్పుడు తెల్సివస్తుంది ఆయన సహాయంలోని బండారం. మీరెంత అమాయకులు ? తెల్లనివన్నీ పాలు అనుకుంటే ఈరోజుల్లో అడుగు ముందు కెయ్యలేం! తిన్నగా గోతిలో పడటమే! ఆయన సహాయమూ, చేబదులూ మనకేమీ అక్కర్లేదు. షావుకారుగారికి మెరకచేను అమ్మేయండి. అంత ధర పెట్టి కొనే ఆసామి ఈ వూళ్లో లేదు.''

మూర్ఛ వొచ్చినంత పనైంది. రామసుబ్బయ్యకు. వెంకటకృష్ణయ్య నిజంగా యింతముందు ఆలోచనతో తనకి చేబదులుగా అయిదువేలు ఇస్తానన్నాడా ? ఎంత స్వార్థం ? తనా కిటుకు కానలేకపోయాడు. ఆయనకు పెళ్లీడు కొచ్చిన కూతురు ఉంది. సంబంధాలు కూడా అడపా దడపా చూస్తున్నాడు తామిద్దరి మధ్య పెరిగిన గాఢ స్నేహాన్ని బట్టే పూర్లో—'స్నేహితు లిద్దరూ వియ్యంకులు కావచ్చు' అనుకోవటం కూడా కద్దు. వెంకటకృష్ణయ్య కూతురు బావుండదు. కారు నలుపు. ముక్కు పొడవు. మూతి కురుచ, కళ్లు లోతు, పళ్లు ఎత్తు. తన కొడుకు చచ్చి గీపెట్టినా ఆ పిల్లను పెళ్లి చేసుకోడు. అదీగాక వెంకటకృష్ణయ్య ఏపాటి కట్న మిస్తాడు ! .... నిజంగా అది చెప్పినట్టు, తనకి ఆయన సహాయం అక్కర్లేదు. ముందు ముందు చిక్కుల్లో యిరుక్కోవాల్సి వస్తుంది. మెరకచేను అమ్మడమే మేలు. అనుకున్నాడు రామసుబ్బయ్య.

ఆ రాత్రే భోజనం చేశాక షావుకారుగారి దగ్గరకు వెళ్లాడు. "మెరకచేను అమ్మతాను. మీరే తీసుకోండి—పదిహేను వేలకు" అన్నాడు.

షావుకారు చంద్రశేఖరం అయిష్టంగా కనుబొమలు ముడుస్తూ—"ఆ! ఇప్పుడు పొలం కొన దల్చుకోలేదు. నీ దగ్గర్నుంచి వచ్చాక ఆలోచించాను. గవర్నమెంటు రోజురోజుకీ ఏవో పన్నులు విధిస్తూ, బిల్లులు పెడుతూన్నది. ఉన్న పొలం జాగ్రత్తగా చేసుకుంంటే చాలు. ఇప్పుడంత ఎక్కువ ధరపెట్టి కొని—నేనేం చేసికొనేది !" అన్నాడు.

రాతిగోడకు నుదురు కొట్టుకొన్నట్లయింది రామసుబ్బయ్యకు. తల దిమ్మెక్కిపోయింది నోరెత్తకుండా ఇంటికి వచ్చాడు. షావుకారు నిర్లక్ష్యంగా నవ్వుకున్న చిరునవ్వు ఆయనకు వినిపించలేదు, కనిపించలేదు.

మరునాడు ఉదయం రామసుబ్బయ్య ఏకాయకీన వెంకటకృష్ణయ్య దగ్గరకు వెళ్లాడు. వీధి అరుగుమీద నీళ్లచెంబు ప్రక్క పెట్టుకుని, పందుంపుల్లను నోట్లో పెట్టుకుని—ఎదురుగ్గా చేతులు కట్టుక్కుని నిలబడియున్న యానాది వెంకటస్వామితో మాట్లాడుతున్నాడు వెంకటకృష్ణయ్య.

సూర్యుడు బార్లపైకి ఎక్కిన సూర్యుడు ములగచెట్టు కొమ్మల్లోంచి కదులుతున్నాడు. తెల్లని ఎండ వీధి అరుగుపైన పడుతోంది. రామసుబ్బయ్య రాకనూ, ఆయన ముఖంపై ప్రేళ్లాడే ఆదుర్దాను గమనించిన వెంకటకృష్ణయ్య కొంచెం సేపు ఏమీ ఎరుగనట్టే వెంకటస్వామితో—పొలం కావలిని గురించి చర్చించాడు. దరిమిలా స్నేహితుని కేసి, కనుబొమలు కదుపుతూ 'ఎప్పుడొచ్చావు ?' అన్నట్టు చూశాడు. క్రితం రాత్రి ఆదరా బాదరా రామసుబ్బయ్య పొలం అమ్మతానంటూ షావుకారుగారిదగ్గరకు వెళ్లటమూ, షావుకారు పెడముఖం చూపెట్టటమూ, అసీతలు ఆయన ముఖం ఉబ్బగా యింటికి వెళ్లటమూ—వెంకటకృష్ణయ్య చెవికి ఆ రాత్రికి రాత్రే సోకాయి. ఆ విషయం కడుపులో పెట్టుకొనే—

"ఏం సుబ్బయ్యా ! ఇంత పెందలాడే వొచ్చావు ?" అన్నాడు వెంకటకృష్ణయ్య నిర్మలంగా నవ్వటానికి ప్రయత్నిస్తూ.

రామసుబ్బయ్య నీళ్లు నమిలాడు.

"మెరకచేను నువ్వే తీసుకో."

ఎదురుగ్గా ఉన్న ములగచెట్టుకేసి, దానికి కట్టి వేసి ఉన్న పాడిగేదె కేసీ చూస్తూ, వెంకటకృష్ణయ్య కొన్ని క్షణాలపాటు తీక్షణంగా ఆలోచించాడు.

"కాలం మారినంత వేగంగా మనుషులు మారతారనీ, మనస్తత్వాలు మారతాయనీ యిన్నేళ్లగా నాకు అభిప్రాయం లేదు. నీ గురించి ఇప్పుడు నిర్ధారణ చేసికుంటున్నాను. మన ఇద్దరి మధ్య పెరిగిన స్నేహమూ, ఆత్మీయతా, మమతలూ, అనుబంధాలూ—ఒకానొక సమయానికి పరీక్షకు నిలుస్తాయనీ, అపార్థాలకు అవకాశాలు కలుగుతాయనీ, ములగచెట్టు కొమ్మల్లా మనసులు విరిగిపోతాయనీ నేనెప్పుడూ వూహించలేదు. నువ్వు మారిపోయావు రామసుబ్బయ్యా ! నన్ను నమ్మలేదు. మన స్నేహపు విలువల్ని విశ్వసించలేదు. నా సహాయం వెనుక స్వార్థం ఉన్నదని భావించావు. నా మనస్సును అంచనా వేయలేక పోయావు. ఎండమావుల్లాంటి ఆశలకు లోనై, అశాంతితో గాబరా

---

ఒక పత్రికా విలేఖరి మరో పత్రికావిలేఖరితో "ఈ చిత్రంలో సెన్సార్ చాలా ఎక్కువగా కట్ చేశారని అన్నారు. ఎక్కడ కట్ చేశారో చిత్రంలో లేదే!"

రెండో పత్రికా విలేఖరి: పత్రికల వాళ్ళకు వేశారు కదూ! అందుచేత దీనిలో తీసేసి వుంటారు. మిగిలిన ప్రింట్సులో వుంటాయటలే !

యం. ఇందిరా (మద్రాసు)

---

పడుతున్నావు. అయినా ఇప్పుడు పొలం కొనే ఆలోచనకు స్వస్తి చెప్పాను. రాత్రి బెజవాడ నుంచి మా బావరెడ్డి వొచ్చాడు. హైదరాబాద్‌లో స్థలాలు చవుగ్గా దొరుకుతున్నాయట. వాటిమీద డబ్బును పెట్టుబడి పెట్టటం ఎక్కువ లాభదాయకమని చెప్పాడు. అదేపని చేద్దామనుకుంటున్నాను. నువ్వు మెరకచేను మరొకళ్లకు అమ్మకోవటం మంచిది. నిర్మోహమాటంగా మాట్లాడినందుకు ఏమీ అనుకోకు" మళ్లీ పందుంపుల్ల నోట్లో పెట్టుకున్నాడు. వెంకటకృష్ణయ్య ములగచెట్టుకేసి చూస్తూ.

రామసుబ్బయ్యకు కాళ్ల క్రింద భూమి జవజవ లాడింది. క్షణంసేపు అక్కడ నిలువలేక పోయాడు. గబగబా ఇంటిదారి పట్టాడు.

కాని ఇంటికి వెళ్లలేదు. షావుకారు చంద్రశేఖరం దగ్గరకు వెళ్లాడు గణపతిని తోడు తీసుకొని.

* * *

పది గంటల ప్రాంతాన రామసుబ్బయ్య ఇంటికి వొచ్చాడు షావుకారు దగ్గర్నుంచి, లక్ష్మీకాంతమ్మ అరగంట నుంచి భర్తకోసం ఎదురు చూస్తూ ఉంది.

వానకు తడిసి, ఎండిన టార్పాలిన్ గుడ్డవలె ముఖం వ్రేళ్లాడవేసి కొచ్చిన భర్తకు గుమ్మంలోనే అబ్బాయి దగ్గర్నుంచి వొచ్చిన లేఖను అందించింది. అరిన అప్పడంలా నులకమంచంమీద చతికిలబడి కవరు విప్పి చదువసాగాడు రామసుబ్బయ్య.

భర్తకు ఎదురుగ్గా ఎత్తు పీటమీద కూర్చున్నది లక్ష్మీకాంతమ్మ. చెవుల్ని చేటలుగా చేసుకొని.

.... నాన్నగారికి,

క్షేమం. ఇంటిదగ్గర అంతా క్షేమమే వని భావిస్తాను. నిన్న మన కోటయ్యగారి నర్సయ్య సెంటర్లో కనబడి—మెరకచేను బేరం పెట్టావనీ, నేడో, రేపో బేరం పైసలవుతుందని చెప్పాడు. నా చదువు నిమిత్తం బంగారంలాంటి ఆ చేను అమ్మవద్దు. ఇప్పుడు త్వరపడి అమ్మినా, రేపు డబ్బు లున్నప్పుడు అల్లాంటి చేను కొనాలన్నా దొరకదు. అన్ని సదుపాయాలూ గల ఆచేనును అమ్ముకోవటం తెలివితక్కువే. అదీగాక ఇప్పుడు నాకు డబ్బు అవసరంలేదు. మెడిసిన్ పూర్తి చేయటానికి ఇకముందు మీరు నెల నెలా డబ్బు పంపనక్కరలేదు. ఇక్కడ నాకు గోపాల్ అనే ప్రాణస్నేహితుడున్నాడు. అతను లక్షాధికారి. నా చదువు కోసం పదివేలు ఇస్తానన్నాడు. ఇవాళే ఓ వెయ్యి రూపాయ లిచ్చాడు కూడాను. చదువు పూర్తిచేసి, ఉద్యోగం ద్వారానో, ప్రాక్టీసు పెట్టో ఆ డబ్బు ఇచ్చుకుంటాను. మళ్లీ నా దగ్గర్నుంచి పుచ్చుకునే పద్ధతిలో నా కివ్వలేదనుకో. అయినా అది ధర్మం గనుక ఆ ఉద్దేశ్యంతోనే, విశ్వాసంతోనే, ఆత్మబలంతోనే డబ్బు తీసుకున్నాను. కాబట్టి నువ్వు మెరకచేను అమ్మవద్దు. నన్ను గురించి, నా చదువును గురించి, నా భవిష్యత్తును గురించి— ఎల్లాంటి దిగులూ, విచారమూ పెట్టుకోవద్దు.

అమ్మ కులాసేగదూ ! అడిగానని చెప్పు.

—వెంకటరామారావు.

లక్ష్మీకాంతమ్మ ఆనందోత్సాహాలతో పరవశురాలై చివుక్కున ఎత్తుపీటమీద నుంచి లేచింది.

"ఎట్టాగైనా అబ్బాయి సమర్థుడు. మెరకచేనుమీద వాడి కెంత అభిమానం. ఆ చేను పంట యింకా మనకు ప్రాప్తముంది. ఎప్పటికీ మెరకచేను మనదే."

రామసుబ్బయ్యకు కళ్లల్లో నీళ్లు గుండ్రంగా తిరిగాయి. కొన్ని క్షణాలపాటు కొయ్యబారిపోయి కూర్చున్నాడు. నోట మాట రాలేదు. భార్య మాటలు మొనదేలిన బాణాల్లా పదునుగా గుచ్చుకున్నాయి.—మెత్తబడ్డ హృదయంతో.

'ఇంకెక్కడి మెరకచేను ? షావుకారు చంద్రశేఖరం పరమైపోయింది—పదివేలకు .... ' అనుకున్నాడు రామసుబ్బయ్య దుఃఖంతో దురపిల్లుతూ.

భర్త ముఖంపై పచార్లుచేసే విషాద మేఘాల్ని చూసి—లక్ష్మీకాంతమ్మ నోటిమీద ముని వేళ్లు పెట్టుకుని నిస్తుపోయింది.

'.... ఛీ. ఛీ. ఈ ఉత్తరం నిన్న రాకూడదూ !' అనుకున్నాడు రామసుబ్బయ్య దుఃఖోన్మాదంతో.

ఆయన జేబులో షావుకారుగారిచేత బయానా క్రింద రవానా కానించబడ్డ పదివందల రూపాయల నోట్లు '—ఈ నేరం మాదికాదు' అన్నట్టు చప్పుడు చేయకుండా పడుకున్నాయి.



## ఏకలవ్యుడు

23 వ పేజీ తరువాయి

అది మొదటిసారి పెళ్ళి చూపుల రోజున శేఖర్ సుశీలను చూడడం......

రెండోసారి చాలా గమ్మత్తు సంఘటనలు జరిగేయి—

ఆవేళ శేఖరైతే సుశీలను పరీక్షించేడు కానీ—

పాపం—శేఖర్ని చూసింది అదాటుగానే తప్ప మళ్ళీ గుర్తు పట్టడం చాలా కష్టం సుశీలకి!!

ఊహలమధ్యలో నవ్వుకుని సిగరెట్టు వెలిగించుకున్న శేఖర్—రెండోసారి—రెండోసారి కలిసికున్న పరిస్థితికి ఫకాలుమని నవ్వి, సిగరెట్టు పొగల మధ్య ఉక్కిరి బిక్కిరైపోయాడు—

ఆనాడు అలాగే ఉక్కిరి బిక్కిరి చేసేసింది తనను సుశీల.......

*          *          *

ప్లాట్‌ఫారంమీదకి ఇంజను బండిని జేరవేసే టప్పటికి మధ్యాహ్నం మూడు గంటలు దాటి పోయింది!

ఎండకు కళ్ళను చిట్లిస్తూ, పెట్టెనూ, బెడ్డింగునూ, చేతి సంచీనూ జాగ్రత్తగా దింపుకుని భుజాన్నున్న వాటర్ బేగ్ను సరిజేసికుంటూన్న ఒక యువతిని మరో నడి వయస్కురాలు ప్రశ్నిస్తోంది—

"మీవారు స్టేషనుకు రాలేదేమమ్మా?"

"నేను ముందరే చెప్పలేదుటండీ వారికి నిర్లక్ష్యం ఎక్కువని! ఆ చివరనుండి మెల్లి మెల్లిగా ఒక్కొక్క కంపార్టుమెంటునే వెతుక్కుంటూ వస్తారు!! జవాబిచ్చి ఇటువైపు తిరిగి చిన్నగా నవ్వుకుంటోందా యువతి.......

మొదటి ప్రశ్నకే తల నిటు త్రిప్పిన శేఖరా ప్రశ్న అడిగిన నడి వయస్కురాలినీ, ప్రశ్నకు వచ్చిన జవాబునీ, ఆ యువతి ప్రక్కకు తిరిగి మనోహరంగా నవ్వుతున్న చిరునవ్వునూ చూసి ఈ విధంగా అనుకున్నాడు—

వెనకనుండి చూస్తుంటే నల్లత్రాచులాంటి జడా—

పొడుగుపాటి విగ్రహమూ—

పొడుగుకు తగ్గ హొందా—

కాస్సేపైనా సుఖాన్ని నోచుకోమని నవ్వుతూన్న తల్లోని మల్లెలూ— కలిసి ఇంత అందంగా ఉంటే ముందునుండి మరీ అందంగా ఉంటుంది కదా.......ఇంత అప్సరసలాంటి భార్య విషయంలోనూ అంతగా నిర్లక్ష్యాన్ని పాటించే ఆ ఋష్యశృంగుణ్ణి చూసితీరాలని నిర్ణయించుకుని ఆమె అరాత్తుగా ఇటువైపు తిరిగేసరికి ఖంగారుగా తలని విదిల్చి జేబులోంచి సిగరెట్టు పాకెట్టూ— అగ్గిపెట్టె తీసి సిగరెట్టు వెలిగించే యత్నంలో మునిగి పోతున్నట్లు నటించాడు—

"ఈ అమ్మాయి......ఈ అమ్మాయి ఖంగారు పడి, అతని మనస్సు — పెళ్ళి చేసేసుకుందా" అని దిగులుపడిపోయింది ...... "అసలీమె ఆనాడు అదాటుగా తను పెళ్ళి చూపులనాడు చూసిన వనకన్యే అని నిర్ధారణ ఏమిటీ" అనుకుని తిరిగి ఆమెను పరికించసాగేడు ఓరకంటితో......

"చలాకీ కళ్ళూ, కొంటెతనం పోతూన్న బుగలో సుడులూ. కొటూ చినటు గా బెదిరిసూ న

వి(రటి పెదవులూ, పెదవుల చివరంలో వెలిగి పోతూన్న నవ్వూ—గాలిహాలుకు ముందుకు ఉరుకు తూన్న చిరువెం(టుకలూ — గంభీరాన్ని ఎక్కడో కొన్తంత అరువు తెచ్చుకుని జా(గత్తగా దాచు కొన్నట్లున్న కనుబొమలూ—'' అన్నీ ఈమే ఈ వనకన్య అంటూ వంతపాడేయి......

అమెనేతప్పు మరో కన్యని చేపట్టవని (ప్రతిన బూనిన శేఖర్‌కి మనస్సు అమె చెయ్యిని ఎవరో పట్టుకోవడం అయిపోయిందని తెలిసేసరికి తెల్ల బోయి దిగులుపడి పోయింది......

ఓరకంటితో తన్ను పరిశీలించే ఆకారాన్ని మరోసారి "ఏమిటీ నీ గొడవ" అన్నట్లుగా రెట్టించి చూసింది సుశీల.

ఏమీ లేదన్నట్లు నటించబోయి ఉలిక్కి పడ్డాడు ఏకలవ్యుడు శేఖర్.

"అమే—అమే" అనుకుంటూ......

నటకులకేగానీ, నటనను గూర్చిన వివరాలు మరి యొకరికి తెలియవు........వూడిపోతూన్న కొంగుని అల్లుకుంటూ ఇటువైపు తిరిగి, ఆ అబ్బా యిని చూసి—"నటకుడేనే" అనుకుంది సుశీల మనస్సు!!

కూతకూసి రైలు ప్లాటుఫారం విడిచి పెట్టే సింది—ముందు చెప్పకుండా నేనే పనులూ చేయ నన్నట్లు .......

ఇంతకుముందు (ప్రశ్నించిన నడి వయస్కు రాలు రైలు కదుల్తూండేసరికి — సదరు వన కన్య భర్తగారిని చూడకపోవడంవల్ల—"మీ వారు రాలేదేం జా(గత్తమ్మా" అంటూ ఆఖరిసారి వీడ్కోలు తీసుకుంది కదిలిపోతూన్న రైలోంచి.

ఆవిడ కనిపించేవరకూ రుమ్మాలు వూపి నవ్వు కుంటూ పోర్టరును పిలిచి "హైదరాబాదు పోవాలి. అవతలి ప్లాట్‌ఫారంమీద వీటి నట్టే పెట్టు" అంటూ కాంటీన్‌కి పోయింది అప్పుడే మేల్కొన్న ఆకలికి నవ్వుకుంటూ అసలు సుశీలా నామధేయురాలైన శేఖర్ దృష్టిలోని వనకన్య!

ఋష్యశృంగుడి కోసమని ఎదురు చూడ బోయిన శేఖర్ అసలు వనకన్యే ఎటో పోయేసరికి ఎటూ పాలుపోక నిలబడిపోయాడు దిగాలుగా.

నవ్వుకుంటూ తిరిగి వచ్చే సుశీల తన సామానులని జా(గత్తగా కావలా కాస్తూన్న ఇందాకటి అబ్బాయిని చూసి, లోలోపల నవ్వుకోవడం మానేసి వ్యవహారం ముదురుతున్నట్లుందే అనుకుంది......

లోలోపల విషయాలన్నీ బయటకు తెలియవు.

నవ్వూ, ఆశ్చర్యమూ, (క్రోధమూ తప్ప! రెండో తెగలో జేరిపోయిన నవ్వును, కోపాన్నీ గుర్తుపట్టి గుర్తించినట్లుగా తప్పుకో పో(బో)యాడు శేఖర్!

కథల పుస్తకం తిరగవేస్తూ అతని ఉనికిని గుర్తిస్తూనేఉంది అతనిని ఎక్కడో చూసినట్లు గుర్తుకు రాగా......

రెట్టిస్తూన్న జ్ఞాపకాల పుటలు అంతకు వేయి రెట్లు వేగంతో మూసుకుని పోయాయి వస్తూన్న (టైనును చూస్తూనే....

అందుకున్న సామానులను భద్రంగా సర్ది పరి సరాలను చూసికుంది సుశీల!

(టైను ఏదో చిన్న స్టేషనులో ఆగకుం డానే వెళ్ళిపోయింది.......

అంతవరకూ సుశీలనే చూపులతో అనుస రిస్తూన్న ఒక అమ్మాయి సుశీల ఆమె వైపు చూసేసరికి చిన్నగా నవ్వింది పరిచయానికి నాంది గీతంగా.......

నవ్వు వెనకగా తాను సర్దుకుంటూ కొంచెం చోటు చేసి రండి—కూర్చోండి — అంటూ ఆహ్వా నించింది ..... పరిచయంలో రెండో మెట్టు — స్నేహంలో మొదటి మెట్టు అన్నమాట.

సర్దుకుని కూర్చుంటూనే మాటల్లోకి అవ లీలగా దిగిపోయింది సుశీల.......

ఎక్కడ వరకూ పోతున్నారో ఒకళ్ళ కొకళ్ళు తెలుపుకుని ఏ పనిమీద వెడుతున్నారో తెలుసుకోవలసి వచ్చేసరికి—కిటికీలోంచి బయటకు చూస్తున్న సుశీల—"అయితే మీ వారి ఉద్యోగం ఏలూరు లోనా? అక్కడ మిమ్మల్ని రిసీవ్ చేసికుంటా రన్నమాట!" నవ్వింది.

"మరి మీరు హై(దాబాదు ఒంటిగా వెడు తున్నారు.....మిమ్మల్ని తీసుకు వెళ్ళే వాళ్ళూ...." నసిగింది పాపం (క్రొత్తగా పరిచయమైన రైల్లో స్నేహితురాలు.......

"నన్నూ—మా వారే రిసీవ్ చేసికుంటారని అనుకుంటున్నారా? ఇంటికి వెళ్ళి ఆయనని నేనే లేపాలి.....కుంభకర్ణుడు ని(దలో అన్నమాట" దొంగ నవ్వు పెదాలమీద తారట్లాడింది.

"ఇంతకీ మీరూ......"

"నేనా—నేను ఏదో బి. య్యే. పాసై పెళ్ళి చేసేసుకున్నాను.......ఇప్పుడు అన్నగారింటికిమండి మళ్ళీ వెళ్ళిపోతున్నాను.......ఈమధ్య మా చుట్టా లింట్లో పెళ్ళి జరిగింది లేండి—మా వారు చీఫ్ ఇంజనీరుగా పని చేస్తున్నారు. సెలవు దొరకక నన్నే పంపేరు........ఇంతకీ స్టేషనుకు కారు పంపు తారో. అదీ మరిచిపోతారో నాకు అనుమానమే" ఏదో బంధువులై పోయినట్లే చనువుగా మాట్లా డేస్తూ, తన విషయాలన్నీ చెప్పేసింది సుశీల.....

"పాపం—ఏలూరు హైస్కూలుల్లో హెడ్మా స్టరుగారి భార్యనని చెప్పుకున్న రైల్లోని (క్రొత్త స్నేహితురాలు సుశీల మొగుడు ఒక ఆఫీసరనీ కారూ, మేడా,వ్యవహారం గలవారనీ,తెలిసుకుని మొహం ముడుచుకుని ఆపాదమస్తకమూ సుశీలను పరీ క్షగా చూడ నారంభించింది. ఎక్కడేనా పట్టుబడు తుందేమో అనీ.......

ఆవిడ మనస్సును ఎప్పటి కప్పుడు మొహం నీడల్లో చదివేస్తున్నా, తన కేమీ తెలియనట్లే— "చలి (ప్రాణం—కొరికేస్తోందండీ......" నవ్వుతూ పమిటను నిండుగా కప్పేసుకుంది మెడని— మెడలోని నగలనూ పరిశీలించడానికి వీలు లేకుండా...

ఆ (క్రొత్త స్నేహితురాలి విషయం కని పెట్టేసింది.......ఈవిడకి నగలులేవన్న మాట అను కుంటూ....అడగబోయేసరికి సుశీలే కలియజేసు కుని—

"డిఫెన్సు ఫండ్‌కి ఆఫీసర్ల భార్యలు నగ లివ్వడం ఒక గొప్పై పోయింది........గొప్పగా మా వారు కారులో వెంటేసుకుని వెళ్ళి నగలన్ని టినీ ఇప్పించేరు......ఇదిగో మళ్ళీ—అన్నయ్యా అమ్మా కలసి ఏమిటో చేయించి పంపేరు...... ఇవీ ఇచ్చేస్తాను" ఎదుటి ఆవిడ మెడలో మెరిసి పోతూన్న నెక్లసును చూస్తూ అంది సుశీల. ఇందులో కూడా నీదే ఓటమి అన్నట్లు!

పది నయా పైసల బిళ్ళంత మొహాన్నీ దమ్మిడీ కాసంత చేసికుని ఏదో నవల తీసి చదివేయడంలో మునిగి పట్టు వటించింది పాపం ఎదుటి ఆవిడ!!

సుశీల ముంచుకొస్తున్న నవ్వును పెదాలతో నొక్కిపెట్టి తనూ కిటికీలోనుండి బయటకు చూడనారంభించింది.......

సంధ్యా తిమిరాలు అలముకున్నాయి—పక్షులు ఎప్పుడో గూళ్ళకి చేరుకోవడం అయిపోయినట్లుంది నక్షత్రాలని ముందుగా పంపి, అసలు సంగతి తెలిసికొని తనూ మెల్లి మెల్లిగా, కొద్ది కొద్దిగా తొంగి తొంగి చూస్తున్నాడు చందమామ మబ్బు పరదాలు మెల్లి మెల్లిగా తప్పించుకుంటూ. ఏలూరు స్టేషనులో చెప్పకుండానే దిగిపోయింది ఆ అమ్మాయి. రైల్లో పరిచయానికి రైల్లోనే భరత వాక్యం పాడకుంటున్నట్లుగా.......

నవ్వుకుంటూన్న సుశీల అదే స్థలంలో మరొక వయసు మళ్ళిన ముత్తయిదువు సర్దుకుని కూర్చుంటూండడం చూసింది.......మదిలో మరో కొంటె వూహ మెదిలింది—నవ్వుకుంటూ తనని చూసిన సుశీలను చూసి తనని చూసే నవ్విందనుకుని ఆవిడ స్నేహం కలిపేసింది......

కొంచెంసేపు కాలం వ్యర్థం అయేక—"పుట్టింటినుండి అత్తింటికా? అత్తింటినుండి పుట్టింటికా? ఎక్కడనుండి ఎక్కడకు వెడుతూన్నట్లు?" నవ్వింది ప్రశ్నల మధ్యనుండి దారి చేసుకుని......

సిగ్గును కొద్ది కొద్దిగా ప్రదర్శిస్తూ—"అత్తింటినుండి......." మరిక సిగ్గు పలకనీయ లేదన్నట్లుగా ఆపేసింది.......

మరో విషయం మునిగి పోతున్నట్లు గుర్తుకు రాగానే "మీ రెంతవరకూ?" అని ప్రశ్నించింది ఆదుర్దాగా సుశీల.....

"అబ్బే వచ్చేదే ......నూజివీడులో దిగిపోతాను. మా పెద్దపిల్ల నిక్కడికి ఇచ్చాం—ఏదో సుస్తీ చేసిందని అర్జంటుగా కబురందేసరికి—అనుకోకుండా బయల్దేరే......."

తలని తాటించుకుంటూ హమ్మయ్య అనుకుంది సుశీల పూర్తి స్వగతంలో—

"మీరు?.......?" తిరిగి ప్రశ్నించింది సుశీల నావిడ.......

ఈసారి పెద్ద శ్రమ లేకుండానే అల్లేసింది కథని సుశీల.......

"విజయవాడలో మావారు వచ్చి కలుస్తారు... అక్కడే ఆయన దిగిపొమ్మంటే దిగిపోవాలి—లేపోతే తిన్నగా మద్రాసు పోవాలి......" అబద్ధం ఆడడంలో నాలిక మెలితిరిగింది.

"అయ్యో—ఇది హైద్రాబాదు పోతుందే..... మద్రాసుపోదు......" ఖంగారు పడిపోయిందావిడ చిన్నపిల్ల సుశీల అమాయకత్వానికి......

"అవునవును.......మరిచిపొయ్యాను — మూడు వంతులు విజయవాడలో దిగిపోవాల్సి ఉంటుంది అనే ధైర్యంతో ఇది ఎక్కేసే—"నని నవ్వింది.

ఈమె మాట్లాడుతున్నది శ్రద్ధగా వినాలని అనిపించినా వినిపించక నవలా పఠనంలోనూ—పిల్లల సంరక్షణలోనూ—రాజకీయాల చర్చల లోనూ మునిగిపొయ్యారు మిగత ప్రయాణీకులు. అందరినీ ఓరకంటితో పరిశీలిస్తున్నా—తన వెనుకనే కూర్చుని కిటికీలోనుండి బయటకు చూస్తూన్నట్లు నటిస్తూన్న ఇందాకటి ఏకలవ్యుడిని మాత్రం చూడలేదు సుశీల.

"ఏదో పిల్ల సుఖపడుతుంది కదా అని చూసి చూసి కలవారింట్లో ఇచ్చేం బోలెడు కట్నం

# ఏకలవ్యుడు

పోసి......ఆడబిడ్డలూ, మరదులూ ఉంటే అదో బాధ అని ఏకైక పుత్రుడు కాబట్టి ఆడపిల్లలు లేకపోవడంవలన చాలా గారంగా చూసికుంటుంది అనుకున్నాం.......తల్లీ, కొడుకూ కలిసి నరకాన్ని చూపిస్తున్నారమ్మా దానికి......" వాపోయింది పాపం. నూజివీడులో దిగిపోవనున్న ఎదుటి ఆవిడ.... బాధ కంఠంలో సుళ్ళు తిరిగింది—చెమర్చిన కళ్ళను తుడుచుకుంటూ అంది పాపం.

"బాధపడకండి — విధి వ్రాతకి తల వొగ్గవలసిందే ....... మా వాళ్ళూ మీలానే అనుకుని మా అత్తయ్యకు హడలిపోయి అసలైన మేనరికం వదిలి మరో సంబంధానికి పోబోయారు. సిగ్గు తెరల మధ్య మా బావని అంత పరీక్షగా ఎప్పుడూ చూడకపోయినా, లీలగా ఆయన ఆకారాన్ని మనస్సులో చిత్రించుకోవడంవల్ల మా వాళ్ళు మరో సంబంధం వెతకబోయేసరికి హడలిపోయాను —చివరికి నీళ్ళను వప్పించి చేసుకున్నాను. నాకు నచ్చింది చెయ్యండి స్వర్గం నిర్మించుకుంటాను. అందులో — అని చెప్పి!!! లేస్తూంటేనే అత్త

"ఇద్దరు పిల్లాలుంటే శిక్ష వేయాలా? అక్కర్లేదా?" ఒక రాజకీయ వేత్త ప్రశ్న.

"ఎందుకూ వేసే శిక్ష, జంట అత్తగార్ల పోరుకి ఆ పెద్దమనిషి సన్యాసం పుచ్చుకుంటూ" డన్నాడు ఓ రచయిత.

మూతి విరిచేది......కనిపిస్తే కళ్ళు చికిలించేది..... నేచేసిన ప్రతీ పనిలోనూ వంక లెన్నేది ...... పెద్ద వాళ్ళెప్పుడూ చెడ్డవాళ్ళు కారని భరించిన కొద్దీ మితిమీరిపోయింది గొడవ ....... కొన్నాళ్ళకి కొడుకును కూడా తనవైపు త్రిప్పుకుంది........

మంచితనం గుర్తించని వేళల్లో అది దండుగ అనిపించి—పద్ధతి మార్చేశాను......ఎంతసేపూ నవలలతో కాలక్షేపం చెయ్యడం — వేళకి వంటింటిలోకి వెళ్ళి చూసి వంట పూర్తి కాకపోతే బజారు నుండి ఏదైనా తెప్పించుకుని తినెయ్యడం — మనుష్యుల సమక్షంలోనే నేను నా కెవరూ లేనట్లు ప్రవర్తించడం ఇవన్నీ చూసి మొట్టమొదట నిర్ఘాంతపోయారు—

మరీ సాధించింది పాపం ఆవిడ తన నోటి గొప్పను చాటుకునే నిమిత్తమై.....

మగవాడనిపించుకున్నారు చెయ్యిని కూడా విదిల్చి చివరకు ఆయన కూడా—వ్యవహారం వంకర తిరిగింది.....పుట్టింటికి పోవటల్లేదు—అత్తింట్లో నడ్డివంచి పని చెయ్యడంలేదు—

ఘోష ఎక్కువయ్యేసరికి పూర్తిగా మౌన వ్రతాన్ని అవలంబించేసేను—

అదే రోజుల్లో తీవ్రంగా జ్వరం వచ్చింది ఒకసారి.......తిండి సరిగ్గా లేక — ఎంత తల్లిని వెనక వేసికుని వచ్చినా ఏరి కోరి.....చేసికున్న నన్ను ఎలా వదులుకుంటారు! అప్పటికే స్వర్గ నరకాలని రెండింటినీ చూపించేను—

ఓ రోజు కొడుకు ఖంగారు పడిపోయి ఆవిడని కూడా గదిలోకి తీసుకుని వచ్చి గది శుభ్రం చెయ్యాలనీ, కిటికీ తెరలు మార్చాలనీ చూపిస్తూంటే కలవరించినట్లుగా అన్నాను — "మీకు మీ తల్లి ముఖ్యం — అనవసరంగా మిమ్మల్ని వేరు చేసిన పాపం నాకెందుకు. నేవెళ్ళిపోతాను ముందుగా— మరో అమ్మాయిని — అత్తయ్య మెచ్చుకున్న అమ్మాయిని చేసుకుని కనీసం ఆమెనైనా సుఖ పెట్టండి...." అని !

మరో రోజు—

"ఇందులో ఏ పాపం ఆమెకి అంటనివ్వకండి —ఆమె స్వభావమే అంత.... అత్తయ్యకి ఏ పాపం లేకుండా చెయ్యి భగవంతుడా — ఇదే నా చివరి కోరిక—" అని అన్నాను....

కొద్దిగా లొంగి వచ్చింది వ్యవహారం—

అహర్నిశలూ మంచం దగ్గరే ఆయన కూర్చునే వారు కళ్ళల్లో వత్తులు వేసుకుని—

జ్వరం తగ్గాక ఆయనవైపు దిగాలుగా చూసి "ఎందుకిలా బ్రతికించేరు నన్ను .... ? చివరికి మిమ్మలందరినీ విసిగించడానికా నేను బ్రతకవలసింది"అని ప్రశ్నించేసరికి మనిషి పూర్తిగా మారిపోయారు...."

కళ్ళల్లో భావ ప్రకటనలూ, ఆ చెప్పే తీరూ చూస్తూంటే ఆవిడకి నిజమేననిపించింది— కొన్ని కొన్ని సందర్భాల్లో కూతురితో తలుచుకుని పోల్చుకుని కంట తడిపెట్టేసింది .... అనుకున్న నూజివీడు రానే వచ్చింది .... "వెళ్ళొస్తాను — జాగ్రత్తగా నిర్వర్తించుకు వచ్చి సుఖపడుతున్నావు— —అదృష్టవంతురాలివమ్మా — మా అమ్మాయికి కూడా ఎప్పుడు పోతాయో చెడ్డరోజులు—" పమిట కొంగుతో కళ్ళని వత్తుకుంటూ దిగిపోయింది—

ఆవిడ దిగిపోయేవరకూ ఆపుకున్న నవ్వుని ఆవిడ వెళ్ళిపోయ్యేక ఆపుకోలేక నవ్వేసింది సుశీల.. తీరికగా కూర్చుని , నవ్వుకుంటే పిచ్చిది అని అనుకుంటారని — చేతిలోని పుస్తకం చూసి మరీ విరగబడి నవ్వుకుంది.

ఆ సందర్భంలో దిగి బయటకు పోయి నవ్వుకున్నాడు ఏకలవ్యుడు 'ఏది నిజం' అనుకుంటూ.. సంతోషం — ఆదుర్దాల మధ్య నవ్వు ఆత్రుతగా వచ్చి నలిగిపోయింది.

సుశీల పెదవులు ఇంకా నవ్వుకుంటూనే ఉన్నాయి ట్రైను బయల్దేరడం—

ఎవరో ఒకావిడ సుశీల వయస్సులోనే ఉన్నా నలుగురు పిల్లల్ని వెంట బెట్టుకుని సర్దుకుని కూర్చోడం జరిగిపోయింది... ఆలోచనా తరంగాలలో తేలియాడుతూన్న సుశీల చేతిలోని పుస్తకాన్ని లాకుంటూన్న ఆవిడ చిన్నారి కొడుకును చూసి—

ఎదురుగా కూర్చున్న వాళ్ళు వింతగా పరికిస్తున్నారు— ఈ లోకంలోకి దిగిన సుశీల ఆ చిన్న పిల్లాడిని మరిపించి పుస్తకాన్ని దాచిపెట్టుకుంటూ ఆవిడతో మాటలలోకి దిగింది... మాట వరసకు మళ్ళీ ఏం మాట్లాడుతుందో అని చెవులు రిక్కించుకున్నాడు వెనక సర్దుకుని కూర్చుంటూ ఏకలవ్యుడు....

అదే కంపార్టు మెంటులో ఇంతవరకూ ఉన్న మరో బృందం వీళ్ళ దగ్గరకు చేరింది .... ఆవిడ చాలా పెద్దావిడ .... పిల్లలందరికీ చిన్నతనంలోనే పెళ్ళిళ్ళు చేసేసిందట చేతులు దులుపుకుని కూర్చుందామని.... ఒక్కొక్క అల్లుడే పెడుతూన్న బాధలు చూసుకుని, హాయిగా ఉండక వీళ్ళకి చిన్నతనంలోనే పెళ్ళిళ్ళు చేసి వీళ్ళ నెత్తి మీద కుంపట్లు పెట్టి తననెత్తిన ఇంతబరువును ఎత్తుకున్నానంటూ వాపోయింది ఆ తర్వాత !

ఆవిడ చరిత్ర విన్న సుశీల పాపం అని నిట్టూర్చుకుని కథకోసం మనస్సును కంచికి పంపింది— ఇద ... ములో నలుగురు పిల్లల్ని సుశీల వయస్సులో ... ఆవిడ కూడా అవునంటూ తన కష్టాలను కూడా వివరించుకుంటూంటే వింది.. కంచి నుండి సుశీల మనస్సు తిరిగి వచ్చింది కథని వెంట బెట్టుకుని ! !

ఇద్దరూ ఎవరి స్వీయకథలు వాళ్ళు వివరించుకుని— ఎదటి వాళ్ళనుండి కొంచెం కన్నీళ్ళూ— ఇంకొంచెం ఓదర్పూ మాటలూ ఒకరి నుండి ఒకరు పొంది— కలసి కట్టుగా సుశీలని అడిగేరు.

"మీదే ఊరమ్మా— ?"—

"నీ పేరేమిటి— ?"

"ఏ ఊరుకు పోవాలిట ?"—

కలసి కట్టుగా మొదలెటి యుగళ గీతం ఒకరి తర్వాత ఒకరు ప్రశ్నించేరు—

తల నిటుత్రిప్పీ అటుత్రిప్పీ అన్నీ విని నవ్వేసింది సుశీల—

ఏకలవ్యుడు ఊపిరి బిగపెట్టుకుని కూర్చున్నాడు—

తల నిటు ఒకసారి అటు ఒకసారీ వరుస క్రమంలో త్రిప్పుతూ ఎవరి ప్రశ్నకి వాళ్ళ సమాధానా లిచ్చింది .. కావలసిన సమాచారం దొరకలేదు—

'ప్చ్' అనుకోబోయి లోపలికే శబ్దాని మింగేసి పెదాలు విరుచుకున్నారు—

ఏకలవ్యుడు నిట్టూర్చుకున్నాడు ...

ఏమీ ఎరగని దానిలా ఓసారి చూసి తల మెల్లిగా వంకించుకుని మొదలెట్టింది సుశీల— "ఇంతకీ మీకు కావలసిన వివరాలు మీ ప్రశ్నలకి నేనిచ్చిన జవాబులవల్ల దొరకలేదుగదూ... సరే— మానాన్న గారు ఇనప్పెట్టెని తెరవడం, డబ్బు లెక్కపెట్టుకోవడం అనేదాన్ని అసహ్యించుకుంటారు కాబట్టి మేమింత గొప్పవాళ్ళం అని చెప్పలేను— నా తర్వాత మరో ఇద్దరి తమ్ముళ్ళని నాకు అందించి— ముచ్చటగా ముగ్గురునీ చూసి మా అమ్మ మురిసిపోతూన్న టైములో క్యాంప్‌కి వెళ్ళాలి అంటూ హాస్పిటల్లో జేరి ఫామిలీ ప్లానింగ్‌ని ఆచరించడంలో ప్రప్రథములై నారని— మాకు ఓ వారం రోజుల తర్వాత తెలిసింది అనుకోండి—" చెబుతూనే గంపెడు పిల్లల్ని కని ఆ గంపని మొస్తున్నా గంప గయ్యాళితనం వదలని ఆ అతివ లిద్దరూ కలిసి సుశీలని ఉరిమిచూడబోయి ఖంగారులో ఒకళ్ళ నొకళ్ళు ఉరిమి చూసుకోవడం గమనించి— ఉబికి వస్తున్న నవ్వును పళ్ళతో ఓసారి నొక్కి పెళ్ళి కథనంలో సాగిపోయింది— "ఇక నేను ఎమ్మే. రెండవ సంవత్సరం చదువుతున్నాను— ఇప్పటికీ మా అమ్మ ఇక పెళ్ళి చేసెయ్యండి మీ అమ్మాయికి అని నాన్నను పో...స్తూనే ఉంటుంది .. మా నాన్నకి మాత్రం ఇవేమీ పట్టవు....'చిన్న తనంలో పెళ్లి చెయ్యడం—వాళ్ళు ఓ పదిమందిని కనడం— ఆ పిల్లల్ని సముదాయించుకుంటూ — ఆ భర్తగారికి సేవలు చేసికుంటూ— రెండు పూటలూ కడుపునిండా అన్నమూ.... ఇంకో రెండు పూటలు కడుపు పెరిగేలా టిఫెనూ— రాత్రి ఏడింటికి నిద్రమొదలెట్టి సుబ్బరంగా ఏ ఆరింటి వరకూవో తిన్నది అరిగేదాకా నిద్రా ఆ తర్వాత టిఫెనూ— అది అరిగి ఆకలి వేసేవరకూ చాకిరీ ఆ తర్వాత భుక్తాయాసపు నిద్రలో అన్నం అరగ కొట్టుకుని తిరిగి మధ్యాన్నం టిఫెనూ— అమ్మలక్కలతో పుక్కిటి పురాణాలూ— పక్కింటావిడ మీదనేరాలూ చెప్పుకుని కడుపులు ఖాళీ చేసుకుని శ్రమపడి వండుకుని తిరిగి తిండీ — మళ్ళా నిద్రా ఇదంతా అసహ్యం.... హాయిగా చదువుకోనీ— తప్పని విషయాలు—ఆఖరున తప్పకుండా నెరవేరుస్తానూ "అన్నారు"— ముగించింది సుశీల—

సుశీల ముగించే ముందే— సుశీల వయస్సులోని ఆవిడ మూతిని బిగించుకుని కూర్చుంది.... ఎదుటి ఆవిడ మొహాన్ని ముడుచుకుంది — ఇంతలో అవతల మొదటి ఆవిడ బాలుగో పిల్లాడు గొడవ చేస్తుంటే తప్పనిసరై చిన్న బోయిన వదనంలో మరీ చిరాకుపడి అటు పోయింది— రెండో ఆవిడ ఈ గడబిడలో ఆవిడ సీటుకు వెళ్ళిపోయి మాటిమాటికీ సుశీలను మింగేద్దామని నోరు తెరవడం— మళ్ళా సుశీల తన నోట్లో పట్టదనో —ఏమో— ముడి చేసికోవడంతో అవస్థ పడిపోతోంది.... ఈసారి భ్రాహాటంగా నవ్వేడు ఏకలవ్యుడు హాయిగా గుండెనిండా గాలిపీల్చుకుని—

వెనుదిరిగి ఉక్కిరి బిక్కిరైంది సుశీల—

ఇటీ పూర్వం రైలు రాకతో రెట్టింపు వేగంతో మూసుకుని పోయిన జ్ఞాపకాల పుటలు సంఘటనలు ఎదురుగాలికి ఒక్కటొక్కటిగా కదులుతూ వో చోట ఆగిపోయాయి.... కారణం అక్కడ ఓ కొంటె అబ్బాయి నవ్వి లీలగా కదలాడి పోయాడు వేవేగంగా అడుగులు వేసికుంటూ....సిగ్గుతో కుంచించుకుని పోయింది....

ఎల్లా జేరిందో రైలు మొత్తానికి హైద్రాబాదును జేరింది— ఈ విషయాన్ని సుశీల చూడలేదు— సిగ్గులో ముకుళించుకుని పోయింది కాబట్టి ! ! !

సుశీలని రిసీవ్ చేసికుందామని వచ్చిన సుశీల అన్నయ్య రామం ఏకలవ్యుడిని గుర్తుపట్టి "ఇతను ఇతను" అంటూ సుశీలతో నట్టుకుని దిక్కులు లెక్కబెట్టే సుశీలని తెల్లబోయి చూస్తూంటే—అతనే పలకరించాడు—'ఎనిమిదికి బదులుగా ఏడు దిక్కులనే లెక్కకట్టి పొరబాటు పడ్డానా ? అని నాలిక కరుచుకుని తిరిగి లెక్కపెట్టి ఒకవేళ "సప్త దిక్కులు— అష్టబుుషులూ" ఏమో అనుకుందే గానీ ఏకలవ్యుడు నిలుచున్న దిక్కులను లెక్కపెట్టలేదనే విషయాన్ని మరిచి పోయింది....

"అతని తల్లీ తండ్రీలకి ఇష్టం లేకపోతే నా కూతురిని ఇవ్వను—" సుశీల నాన్న పట్టింపూ

"నా ఇష్టంలేందే ఆ పిల్ల ఈ గడప తొక్కిందా ?" అంటూ ఏకలవ్యుడి కన్నతండ్రి బెదిరింపులతో కాలం కరుకుగా గడిచి పోతోంది—

అనుకోకుండా సినిమాలో విలన్ హఠాత్తుగా నాయకీ నాయకులను కలిపినట్లు వో గోల్డ్ వైడ్ రోమియో ఇద్దరినీ కలిపేశాడు— ఇద్దరూ బలంగా ప్రమాణాలు చేసేసికుని దేవుడి గుళ్ళోకి పోయి కలసి కట్టుగానూ— విడివిడిగానూ భగవంతునికి మొక్కుకున్నారు— ఏం'... చాలా.... ?" అంటూ శేఖర్ మనస్సు సిగరెట్టు వేలిని కాల్చబోతోంటే అతన్ని కుదిపి లేపి కథని ముగించింది....

* * *

ఉలిక్కిపడివెలుపలిప్రపంచంలో పడినశేఖర్‌ని—

"ఏమండోయ్— శ్రీవారూ—" అంటూ ఏదో ఓ చిన్న మాటుంది ఇటురండి అంటూ వంటింట్లోకి పిలిచి పీటవేసి కూర్చోబెట్టి— అన్నం వడ్డించిన వెండికంచం ముందుకు తోసి—

"ముందు ప్లేటు ఖాళీ చెయ్యండి— నే చెప్పే మాటలు అద్దుకుంటూ"— అంటూ కూర్చోబెట్టేసింది సుశీల—

గతంలో పచార్లు చేసిన మనస్సు పరధ్యానంగా పచార్లు చేస్తూండడం చూసి "ఓయ్— లవ్యుడుగారూ— ఓ పాట పాడేనంటే జాగ్రత్త! పరధ్యానం వదలి మరీ ధ్యాన నిమగ్నులై పోతారు —అని బెదిరించింది—

"దానికేం.... మాటలు అట్టేపెట్టి ఓ కమ్మటి కథ చెప్పకూడదూ ? కథలల్లడంలో సాటిలేని మేటివి ?"— వెనకటి సంఘటలనని త్రవ్వి వెక్కిరించేడు ఏకలవ్యుడు శేఖర్—

నవ్వుతున్న సుశీల బుగ్గలు గులాబీ మొగ్గలయ్యాయి—

పెదవి మీద మల్లె పూవులాంటి దరహాసం వెలువడింది—

పద్మ దళాయిత నేత్ర సొగకన్నులు వాల్చేసింది— సంపెంగవంటి ముక్కు మరీ వంగుని ముడుచుకుని పోయింది.—

"వన కన్యకి అన్నీ పువ్వుల ఆభరణాలే" అనుకుని ముసిముసిగా నవ్వుకున్నాడు— వనకన్యక వరుడు ! ! 



" వచ్చీ రాగానే వేయడం తెలీదుటమ్మా .... పైగా అడగాలా ఈ వెధవ ముష్టి .."

# ప్రేమకు పగ్గాలు

13 వ పేజీ తరువాయి

"పద్మావతి, నేనూ, శైలజా ఇంకా మా హాస్టల్ అంతా రావూ ?" అడిగింది సురేఖ నవ్వుతూ

అంతలో పద్మావతి అన్నది "మా అమ్మ ఒక్కర్తీ ఉండిపోతుందండీ .... తను రమ్మంటే రాదేమోనన్నది ...." జంకుగా.

"నేను వచ్చి అడుగుతాలే" అన్నాడు భాస్కరం ధైర్యంగా.

"సురేఖ వస్తుందిలెండి" అన్నది పద్మావతి.

"మధ్య నీ సంగతి చెప్పవోయ్ !" సురేఖ విసుక్కుంది.

"అందరూ వస్తాంరా భాయ్ !హాయిగా పెళ్లి కేగా ...." నవ్వుతూ మవ్వేమంటావ్ అన్నట్లు చూశాడు శైలజను. ఆ అమ్మాయి అదోలా నవ్వింది.

పద్మావతి సురేఖ యిద్దరూ యిలా మాట్లాడుకోగా చూడటం భాస్కరం యిదే మొదటిసారి. "ఛీ నేనేగా ? కారకణ్ణి !!" అనుకున్నాడు. బాధపడ్డాడు.

అంతలో మూర్తి సరిగ్గా కూచుని "ఒరే ! ది గ్రేట్ అరిస్టాటిల్ ! నేనో చిన్న ప్రపోసల్ అనగా మనవి పెడుతున్నాను" అన్నాడు

భాస్కరం ఒప్పుకోక తప్పదు. ఎవరి మనసులో చికాకు ఎలా ఉన్నా మూర్తి మనసులో శైలజ ఉంది గదా మరి !—అంతలో మూర్తి పద్మావతిని చూసి "అసలు మీరు వొప్పుకోవాలండీ మొదట" అన్నాడు.

పద్మావతికీ నిజంగా భయం వేసింది.

అయినా "ఏమిటీ ?" అన్నది. సభ్యత కోసరం.

"బహుశా ఆయన పెళ్లికి మనం రావాలని ప్రామిస్ చేస్తేగాని ఆయన భాస్కరంగారి సిస్టర్ మారేజీకి రారేమోనే" సురేఖ కలుపుగోలుతనంగా నవ్వింది.

పద్మావతి కూడా నవ్వి "ఔనా ?" అన్నది శైలజను కొంటెగాచూసి— ఆ మసక చీకట్లో శైలజ సిగ్గూ, పద్మావతి కొంటెతనం ఆ రెండూ భాస్కరంమూర్తి గమనించలేదేమో గాని సురేఖ పసిగట్టింది.

"ఆఫ్‌కోర్సు .... అది మరీ దూర దృష్టి గాని.... నాది కాస్త హ్రస్వదృష్టిలెండి మనం ఒక పిక్‌నిక్‌కు వెళ్లాలి అనుకున్నాం— దానికి మీరూ, మీరూ, మీరూ, వీడూ (భాస్కరాన్ని చూపి) రావాలి.... నేను వస్తాను అది నా ప్రామిస్"—అన్నాడు మూర్తి.

"మా వార్డెన్ తెంగెట్టుకుంటుంది"

"మా అమ్మ కోపం పడుతుంది"

"మా వార్డెన్ సంగతెలా ఉన్నా నేను బోటనీ రికార్డు రాయాలి"

అన్నారు ముగ్గు రమ్మాయిలు

"మరి నీ సంగతిరా ?" నిస్పృహగా చూశాడు మూర్తి.

"సరే పోయింది.. గాలీ, వానా వచ్చింది.... ఇక కథ ఏమిట్రా ?"

"నో.... నో.. అలా అనకురా !.... మనం పాత వాళ్లం వీళ్ళు కొత్తవాళ్ళు... పైగా సిస్టర్ సురేఖగారు సిస్టర్ పద్మావతీజీ మాంఛి సర్దా బనవారూ, పైగా మిస్ శైలజగారు మాంఛి మాంఛి .."

"కోతో, కొండముచ్చో అనండి .." శైలజ పెంకిగా నవ్వింది.

"అంటాను ... ఎందుకన్నా.... మీరంతా ఒక్క పిక్‌నిక్‌కి రాలేరే ?.... మరేమనాలి" మూర్తి ఉడుక్కున్నాడు తన ఆశను నిరాశ చేస్తున్న పద్మావతి మీద ముఖ్యంగా కోపం చూపి.

"మరి ఆడపిల్లలం గదా !" అన్నది శైలజ.

"వేరే పిక్‌నిక్ లుంటాయా మీకు స్త్రీలకు మాత్రమేనని !" వెటకారమాడడు మూర్తి. కావాలంటే మీ వార్డెనమ్మను తీసుకురాండి... ఐ డోన్ట్ హేవ్ ఎనీ అబ్జెక్షన్...."

"అది కాదండీ ? భాస్కరం తప్పని సరిగా మిత్రున్ని బలపరిచాడు...." మనం హాయిగా ఒక్కరోజులో ఏ సింహాచలమో.... భీమునిపట్నమో లేదా దగ్గరగా ఉన్న మాధవధారకేనా సరే.... పోయి సర్దాగా వద్దాం... మామూర్తి మంచివాడు, అక్కడ సైతం వేరుశనక్కాయలు చిలగడ దుంపలూ, తంపట కాయలూ . అవీ ..."

"అది సరేనండీ ! కాని వార్డెనమ్మ ఉత్త

పెక్కుబాయత్తగారు .... గార్డియన్ పర్మిషన్ అంటుంది. అదీ సంగతి....'సురేఖ చెప్పింది.

మూర్తికి ఒక ఐడియా వచ్చింది. "బళ్ళో కెళ్ళొద్దు అనదుగా ? మీ పెక్కుబాయి యత్తగారు ? !.... అంచేత బళ్ళోకని పిక్‌నిక్‌కి చెక్కేద్దాం...." అని మళ్ళీ మగాళ్ళతో మాట్లాడు తున్నట్లు మాట్లాడేస్తున్నానే అని సిగ్గుపడ్డాడు.

"ఈ అబ్బాయికి ఇంకా కుర్రతనం పోలే" దనుకుంది పద్మావతి. తనకూ వెళ్ళాలనే ఉంది కాని భాస్కరాన్ని ఏడిపించాలనీ ఉంది. బతిమా లించుకోవాలని ఉంది.

చివరికీ సమస్యను సురేఖ తేల్చింది.

"పై వారం మొత్తం హాస్టలంతా పిక్‌నిక్ అంటే వనభోజనానికి లారీలమీద బస్సుల మీదా తరలి వెళ్తారుట సీనియర్ లీలావతి చెప్పింది... అప్పుడు మీరూ రాండి.. మేమూ వస్తాం...." అన్నది.

"సరిలెండి ! నలుగురితో పాటు నారాయణా!" అనమంటారు. మూర్తి చేతులు ఎత్తి నెత్తిన పెట్టుకున్నాడు.

"మీ ఇష్టం, శైలజా" అనండి సురేఖ నవ్వింది. భాస్కరం శ్రుతి కలిపాడు.

శైలజ కందిపోయింది. "పేరుశనక్కా యలూ అంటారాయన" అన్నది చిన్నగా.

"బెల్లమో అంటారు సురేఖగారు" అని పద్మా వతి అందించింది.

"సరే ! అది బెటర్ ఐడియానే గాని, నేను పోయినేడాది వెళ్ళాను" అన్నాడు భాస్కరం.

సురేఖ అన్నది "పద్మావతి నేనూ లేం, శైలజా మూర్తిగారూ కూడా లేరూ"—

"ఓ. కే. మనం వేరే యూనిట్‌గా విడి పోదాం...."

మూర్తికి ఆ అవకాశం కూడా పోగొట్టుకోవా లని లేదు... ఒప్పుకుని ఠేంగున లేచాడు.

సముద్రం హోరున వీడ్కోలిచ్చింది.

పద్మావతిని కూడా రమ్మని సురేఖ శైలజా తమ హాస్టలుకేసి, "కిర్లంపూడి" "కోట"దాకా నడుస్తా"మంటూ మూర్తి భాస్కరం— చెరో దారీ పట్టారు.

శైలజను "ఈ భాస్కరం గారి గురించి నీ అభిప్రాయం ఏమిట"ని అడిగింది సురేఖ.

పద్మావతి ఆ మాట వింటూనే నొచ్చుకుంది.

"అదేం ప్రశ్న" అంది కోపంగా.

శైలజ వెంటనే "ఆ ప్రశ్నమీదే పద్మ గారూ ! మీరే చెప్పరూ" అన్నది నవ్వుతూ.

"మూర్తిగారు మంచివారు సరేనా !" పద్మా వతి రాజీకి వచ్చింది.

"అమ్మదొంగా దొరికార్ !" అన్నది శైలజ పద్మావతిని జెడపట్టుకుని లాగి.

సురేఖ చెప్పింది "పద్మా ! నువ్వు రేపు వెళ్ళవే ఇంటికీ, ఇవాళ యిక్కడేవుండు " అని

"అమ్మో ! అమ్మ తిడుతుందే" నంది పద్మావతి.—

## 34

ధనమ్మగారికి ఆవకాయ అందినట్లుగా రాసింది సురేఖ. లేకపోతే ఆవిడ మండిపోతుంది.

"పాపం ! ఆయనేదో మొహమాటానికి అలాగే అంటే ఆవకాయ ఇచ్చింది దొడ్డమ్మ... పైగా కాబోయే అల్లుడుట ?.... వెర్రి దొడ్డమ్మ ! చదువుకోలేదు కాలేజీలో... — పైగా ఓణీలు బాడీలు వయస్సుకే పెళ్ళి చేసేస్తారుగా వాళ్ళకి, అంచాతనే దొడ్డమ్మకి బొత్తిగా ఈ "లవ్ అఫైర్స్ వాటి బాధ తెలీదు." అనుకుంది. పుస్త కాలు సర్దుకుంటూ....

భాస్కరం చెల్లెలి పెళ్ళికి ఎలాగా తాను వెళ్ళాలి. దాని పెత్తనం అంతా దొడ్డమ్మదే గనుక— రాక పోతే ఒప్పుకోదు— పాపం ? ఇప్పట్నించి ఆయ నను నొప్పించటం ఎందుకూ ? పద్మావతికి ఏమీ తెలియదు— అనవసరంగా బాధ పడుతుంది.

శైలజతో ఆ మాటే అన్నది.

"పైగా దానికి జీవితమనే పెద్ద బండ నెత్తిన ఎవరో ఉంచారనుకుంటుంది — ఆడపిల్ల కదా ! తాను భాస్కరం గారిని ప్రేమిస్తోంది కదా ! అతణ్ణి మురిపించి, ఆకర్షించి దారికి తెచ్చుకోవాలా ? — లోపల ఉడుక్కుని బాధ పడాలా ?" అని

శైలజ సురేఖని అడిగింది. "అయితే సురేఖ గారూ! ఆడపిల్ల ప్రేమించిన వాణ్ణి ఆకర్షించాలా?"

"మరి ? ప్రేమంటే ! !...." సురేఖ చిలిపిగా చూసింది శైలజను.

"ఒకవేళ ఈ ఆకర్షణనే ప్రేమఅంటే...?—" శైలజకు ఏమని అడగాలో అర్థం అవలేదు. సురేఖే అన్నది "అంటే అపవిత్రమేంకాదులే ! అదే రానురాను అనురాగమై అనుబంధమై రాణిస్తుంది" అని నవ్వింది.

"ఆరాధన చేస్తూ ఆవేదన పడుతో ఉంటే ప్రేమ అనుకున్నాను సురేఖగారూ ! అదే పుస్త కాల్లో చూశాను నాకు మా 'బామ్మ' ఒకావిడ కులుకుతావెందుకే 'సానిపాపలాగా' అనేది — అప్పటి నించీ, అదో భయం—" అంది శైలజ అమాయకంగా.

"అదంతా, పెళ్ళైపోయాక ఒక జీవితా నికి రెండు చక్రాలైతేను — అంతేగాని ఇప్ప ట్నించి నీవు, మూర్తిగారిని సేవిస్తూ "నేను సావిత్రిని" అన్నావో— ఆ సత్యవంతుడు మరో తిలోత్తమ దగ్గరికి పరిగెడతాడు!"

సురేఖ మాటలకు బోలెడు సిగ్గూ సంతో షమూ పడి గభిక్కున "గురూజీ ! థాంక్స్" అని ఆ అమ్మాయిని కౌగలించుకున్నంత దగ్గ రిగా వచ్చింది.

"శీఘ్రమేవ ! వివాహప్రాప్తి రస్తు" నవ్వింది సురేఖ అని నవ్వుతో "ఫో ? ఆ మూర్తిగార్ని కౌగలించుకో" మన్నది.

"ఇన్ని కబుర్లు చెబుతారు సిస్టర్ !, మరి మీరు ఎవర్నీ ప్రేమించలా ?"

శైలజ కళ్ళింత లేసి జేసుకుని చూసింది. సురేఖకేసి కుతూహలంగా.

"ప్రేమించాను—"

"ఎవర్ని ?" దగ్గరిగా జరిగింది శైలజ. సురేఖ అదోలా నవ్వింది.

"మొదట అడిగితే మా దొడ్డమ్మని మళ్ళీ అడిగితే జీవితపు విలువల్ని...."అన్నది

"పద్మావతిగారికి భాస్కరంగారిమీద కోపం —ఒకవేళ అతను మిమ్మల్ని...."

సురేఖ మధ్యలోనే అందుకుని "ప్రేమిస్తున్నా డని అనుమానం ఔనా ? ప్రేమించ కూడదా ?" అన్నది. సూటిగా చూస్తూ.

శైలజ చకితయ్యింది.

"నేను పద్మావతిని ప్రేమిస్తున్నాను. అదీ నన్ను ప్రేమిస్తున్నది." అన్న సురేఖ మాటలకు తేరుకుని శైలజ మళ్ళీ అడిగింది.

"అంటే మీరూ....అలాగే...."

"నేను పద్మావతిలాగ భాస్కరాన్ని ఆశించడం లేదు .... తాను ఆశిస్తున్నది .... అతని ఆకర్షణకు దానిలోని ప్రలోభం తోనే ప్రారంభమైంది అసలు దాని ప్రేమ .... కాని నా ప్రేమకి మరో పేరు స్నేహం .... ఇది గురూజీ అన్న నీ మీద ఆ పద్మమీదా.... భాస్కరం గారి పట్ల ఒక్కటే.. ఎందుకంటే ?: ఏమో ? నేనే చెప్పలేను. నాకేదో మీ అందరి గురించి ఆలోచిస్తుంటే అదో థ్రిల్ అనుకో...." సురేఖ లేచి నిలబడి,

"రా ! పోదాం ! పద్మావతికి ఏమీ చెప్పకూ.... అది భాస్కరం తన సొంత సొత్తు అనుకుంటున్న దప్పుడే.... అలా సొంతం చేసుకోడంలోనే పురు షుడు చిక్కకండా పోతాడు — లేదా ఆ ప్రయ త్నంలోనే స్త్రీ అతనికి అలుసయి పోతుంది" అని గబగబ నడిచింది. శైలజ అనుసరించింది.



సురేఖ కి 'స్పీడ్' ఎలా వచ్చిందాని ఆశ్చర్య పోతూన్నది శైలజ.

హాస్టలు బస్సు అమ్మాయిల నందరినీ ఎక్కించుకుని పూలరథంలా వెళ్లిపోయింది యూనివర్సిటీకి. ఉదయం మహారాణీపేట నుంచి తీసికెళ్లడం — సాయంకాలం దిగబెట్టడం ఆ బస్సువంతు—

శైలజకి సురేఖమీద చాలా గౌరవం వచ్చింది. మొదట్లో సురేఖ అందాన్ని చూసి ఉడుక్కున్న శైలజ ఇప్పుడామెను గౌరవిస్తున్నది. 'ఆ భాస్కరం గారు ఈ 'సురేఖను' ప్రేమించినా ఆశ్చర్య పోనక్కర్లేదు.'

"సురేఖ అన్నట్లు పద్మావతి మీద భాస్కరానికి ఉన్నది కేవలం సానుభూతియో ఆకర్షణో అయితే దాన్ని నిలుపుకునే ప్రయత్నంలో సాధన అవసరమే అవుతే సురేఖ భాస్కరాన్ని గెల్చుకోవడం కష్టంగాదు."

"స్నేహమనేది ఒకటి లేకపోతే అది పట్టి పగ్గమే వేయకపోతే శిష్ట సమాజమూ అనేది ఒకటి రూపొందక పోనేమో...." — భయపడ్డది శైలజ. సురేఖకు యితరులపై గల అధికారం లాంటిది తనకు లేదు. మూర్తిని చూస్తూనే తాను జావజావ ఐపోతుంది. కరిగి పోతుంది. 'ఉహూఁ' అనుకుంది ఆలోచనలు విదిలించ కున్నట్లు.

"క్లాసుకు వెళ్తా పగటికలలు కనకూ, టాటా!" —సురేఖ కేకవేసి చెయ్యి ఊపుతూ వెళ్లిపోయింది.

* * *

"సురేఖకు నాలుగు సంగతులూ విడమర్చి చెప్పాలి. ఆ అమ్మాయి తప్ప తనను ఇప్పుడు రక్షించగల వాడు లేడు."

"ఒక్క మాట సురేఖ పెదాలు విప్పి ఒక్క మాటతో తన జీవితాన్ని సానుకూల పరుస్తుంది. అదే ఒక్క మాట మరో విధంగా ఆ పిల్ల అన్నదో తన చెల్లెలి కాపురం కష్టాలకు నష్టాలకు గురి అవుతుంది." అనుకున్నాడు భాస్కరం.

"పద్మావతిని పెళ్లి చేసుకోలేక పోతే ఇక జీవితంలో పెళ్ళే చేసుకోను" అందామనుకున్నాడు సురేఖ దగ్గరకు వెళ్లి— అలా చెబితే "ఎవరొద్దన్నారూ ?" అంటుందేమో....

"పోనీ ! నాకు మీరంటే ఇష్టం లేక పోడానికి కారణం. నేను అప్పుడే ఒకరి ప్రేమకు దాసుణ్ణి— ఒక హృదయాన్ని దోచుకున్న నేరస్తుణ్ణి" అందాం అనుకున్నాడు. ఇవన్నీ మనసులో ఆలోచించే మాటలు, పుస్తకాల్లో రాసుకునే మాటలూను....

నోరు పెగిలిరావు.

పైగా సురేఖ తనను అపార్థం చేసుకొనే వీలులేదు. "పద్మావతి చేసుకున్నా చేసుకోవాలితప్ప తనను సురేఖ అపార్థం చేసుకోదు." అనిపించింది.

"పద్మావతి చదువు మానేస్తుందేమో.... పోనీ వెళ్లి వాళ్ల అమ్మగారితో మాట్లాడ్తాను.. కాని జయమ్మగారు చాలా గట్టి మనిషి. జీవితాన్ని అనుభవ పూర్వకంగా తెలుసుకున్న వ్యక్తి. నేరుగా పిన్నమ్మదగ్గ రికి పోయి "ఇదుగోనమ్మా మీ అబ్బాయి ఇలా చేశాడు— ఇదుగో మా అమ్మాయి" అని వెంటనే నిలదీస్తే....

భయం వేసింది. పిన్ని నెలా ఒప్పించాలో ఇప్పుడప్పుడే ఆలోచించగల ధైర్యం లేదు భాస్కరానికి.

"వసంత పెళ్లి అవ్వాలి."

ఆ మాటే పదిసార్లు పద్మావతికి వినిపిం

# ప్రేమకు పగ్గాలు

చేలా అన్నాడు. "ఇంకేం సురేఖా మీరూ బంధువులయ్యారు—నేనేగా పరాయిదాన్ని" అన్నదిఅక్కసుగా

"అవును, ప్రస్తుతానికి అంతే.... నువ్వు భాజా భజంత్రీలతో రావల్సిన బంధువురాలివి కదా ?" అన్నాడు.

"అబద్ధాలు !" అన్నది పద్మావతి.

"కాదు." అని తాను అనకముందే విసవిసా వెళ్లిపోయింది కూడా.

* * *

పద్మావతి దృష్టిలో భాస్కరం పెళ్లి చూపులకువెళ్లడంకన్నాఅవిశ్వాసం మరొకటిఉండదు.

"ఒక ప్రేమించిన పురుషుడు తానై ఆ మాను చెప్పుకోలేకపోతే ఎలా ?"

పద్మావతి ఆలోచనలాతీరుగా ఉన్నాయి. బహుశా ఇక్కడే కాబోలు సమాజమనేది వస్తుంది. అంతస్తు అనేది ఉంటుంది. ఇది మనుష్యులు తమ బలహీనతకు 'డాలు' (రక్షణ) గా 'అండ'గా వాడుకునేదై ఉంటుంది.

పద్మావతికి మనసు ఎంతో చిన్న పోయింది—! తాను పంతులమ్మ ఉద్యోగం కోసరం వచ్చింది.

**"నీకు 50 వేల ఖరీదు చేసే ఇల్లుంది కదా?" మిత్రుడడిగాడు రాజారావుని.**

**"ఉండేది పెళ్ళికి పూర్వం, కాని ఇప్పుడు మా ఆవిడ స్నోలకీ పౌడర్లకీగాను అది తాకట్టు పెట్టేశాం" అన్నాడతను.**

కాని సురేఖ గొప్పకోసరం చదువుకుందికి వచ్చింది ! !

అబ్బ ! ఎంత తేడా.... ?

అట్నుంచి క్లాసుకి వెళ్తూన్న భాస్కరాన్ని గమనించి వెంటనే రెండడుగులు వెనక్కివేసి, అతను గేటులోనించి లోపలికి వెళ్లిపోయాకా వెళ్లింది పద్మావతి.

* * *

సైన్సు కళాశాలమీద కాలమూర్తిలా నాలుగు ముఖాలతో, కాలన్ని కొలుస్తూ గడియారం తిరుగుతున్నది. క్లాసులకు వెళ్తున్నారు. వస్తున్నారు. కలకలలాడుతున్నారు. కిలకిల మంటున్నారు. మాష్టర్లు సుద్దముక్కలు అరగదీస్తున్నారు. విద్యార్థులు, 'చిత్తు' పుస్తకాలు నింపుతున్నారు. చాలా మందికి ఈ చిత్తు పుస్తకాల నుంచి ఫెయిర్ నోట్సులు రాయకుండానే కాలం తిరిగిపోయి పరీక్షలొస్తాయి. ఒక్కొసారి 'క్లాసు'లూ వస్తాయి. అనక చెలామణీ అవుతాయి. పద్మావతి రాసింది నోట్సు. సురేఖా రాసుకుంది. వెనకనున్న ఒక అబ్బాయి సురేఖ బొమ్మను గీద్దామనుకుని మొత్తానికి రెండు జెడలున్న అమ్మాయి రూపాన్ని గీశాడు. అప్పటికి పోయినేడాది యూనివర్సిటీ ఫస్టు వచ్చిన 'దామోదరన్' ఈ ఏడాది 'మాష్టరై' పోయి వచ్చినవాడు—ఏడు సుద్దముక్కలు రాయడం చాతగాక విరిచేశాడు

మొదటి వరుసలోనే అమ్మాయిలు!—అందంగా అలంకారం చేసుకుని, చూస్తో కూచోడం దామోదరానికి ఈ మధ్య నచ్చడంలేదు— ఇదివరకు ఇదే రూములో, ఇదే వరసలో వేరే రాజం, సుందరం, సకల అనే అమ్మాయి ఉండేవారు.... తాను రెండో వరుసలో ఉండేవాడు. అప్పుడు ముసలి లెక్చరర్ గారొకరు దడదడలాడించేవాడు క్లాసు తీసుకుని—కాని తాను? అతని గుండెల్లో రైళ్లు పరిగెడుతున్నాయి దడదడా.... సురేఖ కొంటెగా చూస్తుంది కోలగా నవ్వుతూ నోట్సు తీసుకుంటుంది.

ఆ అమ్మాయి ఏం రాస్తుందో తెలియనంత జోరుగా రాస్తోంది.

దామోదరన్‌కి వళ్లుమండి పోయింది. కాని ఆడపిల్లల నెందుకులే అడగడం అనుకుని కుర్చీలో కూచుని బల్లలంచు పట్టుకుని—

"మే ఐనో వాట్ యూ ఆర్ డూయింగ్?" అన్నాడు వెనక బల్లమీది 'రాజాను'— సురేఖ జెడలకు మురిసిపోయిన చిత్రలేఖనం అభ్యసిస్తున్న రాజానే అడిగాడు.

"నేను మిమ్మల్ని వింటున్నాను" టక్కున చెప్పేశాడు రాజు.

"నేను మీరేదో డ్రాయింగ్ వేస్తున్నా రనుకుంటున్నాను?" అన్నాడు దామోదరన్.

"సారీ సర్, నాకు బొమ్మలు అసలు చూడటమే రాదుసార్ !" నిజంగా చెప్పాడు రాజు.

"థాంక్యూ?.... ఎండ్ నౌ కమింగ్ టుదీ...." దామోదరన్‌కి పాఠం చెప్పక తప్పదుగా.

పద్మావతికి నోట్సురాస్తున్నా ఆవేదన.... సురేఖకు, అసలు పాఠాలంటేనే ఉదాసీనత.... "గంట కొట్టారి" అనిపించింది అందరికీ.

కొట్టేశాడు కూడా ! !

"సో ! ఐ విల్ బి టేకింగ్ యువర్ క్లాస్ ?.." దామోదరన్ వాచీ చూసుకున్నాడు, హాయిగా.

"..టుమారో మాన్ సార్ !" రాజు వాక్యం అర్థోక్తిలో అందుకు పూర్తిచేశాడు.

"థాంక్యూ"—

దామోదరన్—అతని ననుసరించి విద్యార్థినులూ, ఆనక అబ్బాయిలు బయటపడ్డారు.

"పద్మా ? నీకు నా గెస్టుగా కశింకోట పిక్‌నిక్ రిజర్వ్ చేశానే...రావాలిసుమా....."

సురేఖ చెప్పింది.

"ఎందుకే నాకూ ?"

"నాకెందుకూ ? నీకూ అందుకే !"

"నేను నువ్వు నీ నోట్సు ఇస్తే రాసుకుంటాను'." పద్మావతి గంభీరంగా అడిగింది.

"నా మొహం ఇందులో ఏముంది ? కావాలి అంటే శ్రీ దామోదరన్‌గారి అసలు నోట్సు పట్టుకొస్తాను రాసుకుందాం.... అదిసరే.... శైలజా, మూర్తీ, మహా సరదాగా ఉన్నారు.... నువ్వూ రావాలి. ఈ మధ్య వైరివేదాంతం బాగా నీతల కెక్కుతోంది." అన్నది కోపంగా సురేఖ.

"ఏమో తల్లీ ! అంతా నీ ఇష్టం. నాకు ఉద్యోగం కోసరం పొట్టపోషణ కోసరం సుమా ఈ చదువు ఈ తాపత్రయమంతా" నన్నది దీర్ఘంగా నిశ్వసించి పద్మావతి.

"అబద్ధం.... ! రా ! కాఫీ త్రాగుదావ్ ! మళ్లీ నెక్స్టు అవర్‌దాకా క్లాసు లేదుగా !" సురేఖ లాక్కుపోయింది! **(ఇంకా ఉంది)**

తున్నాయి. తను తప్పించలేని విధి వ్రాత తెలుపుతున్న ఆకాశవాణి అనుకున్నాడు. రక్తం, నిరపరాధులైన మనుష్యుల రక్తం, కావాలని కోరుతున్నట్లు ఉంది. విచారంలో మునిగిఉన్న ఈ అబ్బాయి భావాలు చిత్రించే ప్రయత్నం నేను చెయ్యదలచుకోలేదు ఏవేవో ఆలోచనలతో అతనికి పిచ్చిపట్టినట్లు అయిఉంటుంది. అలాగే కొంత సేపు ఉండిపోయి, చివరికి లేచాడు పేటిక మూసి వేగంగా ఇల్లువదిలి బయటికి వెళ్ళిపోయాడు. ఎటు వెడుతున్నాడో కూడా గమనించకుండా పిచ్చిగా ఇటూ అటూ తిరిగాడు

కొంచెం కొంచెంగా బయట గాలికి అతని ఆవేదన ఉపశమించింది. నిదానంగా తన పరిస్థితి గురించి ఆలోచించాడు దీనినుంచి వెలుపలికి రావటం ఎలాగా, అనిఆలోచించాడు. ఇంతకుముందే చెప్పినట్లు బారిచినీ హంతకుడని అతనికి నమ్మకంలేదు. కాని, అగోస్టని అనే బందిపోటు వ్రాసిన ఉత్తరం విషయంలో మాత్రం ఏదో అన్యాయం జరిగివుంటుందని అనుకున్నాడు ఈ ఉత్తరంలోనే తనతండ్రి హత్యా రహస్యం దాగి ఉండాలి అనుకున్నాడు. దొంగ సంతకం నేరం నిరూపించటం వీలుకాదని అతనికి తెలుసు అతనిలో దాగి ఉన్న కార్సికన్ ప్రతీకార వాంఛను అనుసరించి తేలికగా పగ సాధించినట్లయితే తనతోటి సైనికులు, పారిస్‌లో మిత్రులు అందరికన్నా ఎక్కువగా మిస్ నెవిల్, ఏమనుకుంటారో అని భయపడ్డాడు. తన చెల్లెలి ఎత్తిపొడుపులు తనలోని కార్సికన్ చైతన్యానికి న్యాయంగానే తోచాయి. ఇటు అధర్మప్రవర్తనకీ లోబడకుండా అటు ఆత్మాభిమానానికి దెబ్బతగలకుండా ఉండాలంటే ఎప్పకేట్ (బారిచిని) కొడుకులలో

# కోలంబా

21 వ పేజీ తరువాయి

ఒకరితో పోట్లాట కలిపించుకుని ద్వంద యుద్ధం ప్రారంభించటం కన్నా వేరే గత్యంతరం లేదనిపించింది ఆర్సో దెల్లా రెబ్బియాకి. కత్తి వేటుతో కాని తుపాకీగుండుతో కాని ఈ వ్యవహారాన్ని ముగించటం తన 'ఫ్రెంచి అభిప్రాయాలకీ' కార్సికన్ అభిప్రాయాలకీ కూడా సమ్మతంగా ఉన్నట్లు తోచింది. ఇక తన కర్తవ్యం ఏమిటా అని ఆలోచించటం

నౌకాసంకేతాలు అంతగా పరిచయం లేని ఓ నౌకాధికారి ఓ ద్వీపం సమీపిస్తూ తన పడవనంతా జండాలతో అలంకరించాడు.

ఆ ద్వీపం దగ్గరకు వచ్చిన ప్రతి నౌకా జండాలు చూసి వెనక్కు తిరిగి పోసాగింది. తర్వాతగాని ఆ కుర్ర నౌకాధికారికి తెలిసిరాలేదు. ఆ జండాలకు అర్థం— "ఇక్కడ మశూచి ఎక్కువగా ఉంది. నేను మీకు తెలియపరుస్తున్నాను" అని

రామారావు (రాజమండ్రి)

మొదలుపెట్టాడు. అప్పటికే తన మీదనుంచి పెద్ద బరువు తీసినట్లయింది. వేరే అంతకన్నా సంతోషకరమయిన ఆలోచనతో మనస్సు కుదుటపరచుకున్నాడు. మిస్ నెవిల్ వచ్చిన తర్వాత ఆమెకి సంతోషం కలిగించాలంటే ఏమేమి చెయ్యాలో ఆలోచించాడు

తిరిగి గ్రామంలోకి వెళ్ళిపోవటానికి ఉద్యుక్తుడయ్యాడు; తనకే తెలియకుండానే ఊరిబయటికి వచ్చివేశాడన్న మాట ఇంతలో పొదలలోనుంచి ఎవరో చిన్న అమ్మాయి పాటపాడటం విన్నాడు. తన పాట ఎవరూ వినటం లేదనుకుంటోంది కాబోలు ఆ పిల్ల! విషాదంగా, ఒకటే స్వరంతో పాడుతోంది. "దూరదేశంలో నా కొడుకా, నా కొడుకా–నా క్రాస్‌నీ, నెత్తురుతో తడిసిన నా చొక్కానీ కాపాడు..."

"ఏమిటి చిన్నమ్మాయి పాడుతున్నావు?" అన్నాడు కొంచెం చిరాకుగా హఠాత్తుగా అప్పుడే ఆమెను చూసిన ఆర్సో

"మీరా ఆర్సొఆంటన్" అని అరిచింది ఆ చిన్న అమ్మాయి భయపడుతూ. "కొలంబా గారు కట్టిన పాట......"

"దాన్ని నువ్వు పాడటానికి వీల్లేదు!" అన్నాడు ఆర్సో కఠినంగా.

ఆ చిన్నపిల్ల ఇటూ అటూ చూసింది పారిపోదామని. కాళ్ళ దగ్గరే, గడ్డిమీద ఉన్న పెద్ద మూట గనుక లేకపోతే ఎప్పుడో పరిగెత్తి ఉండేదేమో

ఆర్సోకి అప్పటికే కోపం కొంచెం తగ్గింది.

"ఏమిటి చిన్న అమ్మాయి తీసుకుపోతున్నావు?" అని అడిగాడు వీలయినంత నెమ్మదిగా.

చిలినా కొంచెం సంకోచించినా, చివరికి మూట విప్పిలోపల సామాగ్రి అంతా చూపించింది.

"ఈ రొట్టె ఎవరికి తీసుకుపోతున్నావు అమ్మాయ్?" అని అడిగాడు మళ్లీ.

"మీకు తెలుసుకదండీ. మా మామయ్యకి"

"ఆయన ఒక బందిపోటుకదూ?"

"మీకు ఏం కావలసినా చేసి పెడతాడు ఆర్సొఆంటన్ గారూ..."

"నిన్ను గనక పోలీసులు చూస్తే అతనెక్కడ అని అడగరూ?"

"పొదల్లో పని చేసుకునే 'లూకా' (కార్సికన్‌లకి బద్ధకం

## అశోకా రాయల్ టాల్కం పౌడరు మరియు అశోకా స్నో




## ఋతుక్రమం ఆలస్యమైతే?

○ విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన దేవిపిల్సు వాడండి ○

పూర్తికోర్సు ప్యాకెట్టు 28 మాత్రలు వెల రు 11/- సగం కోర్సు ప్యాకెట్టు 14 మాత్రలు వెల రు 6/50 వి పి ఖర్చు అదనము ప్రతిచోట దొరకును

దేవి పిల్సు ముఖ్యంగా ఆలస్యమైన క్రమముగాకాక పోయిన బాధతో కూడిన లేక ఆగిపోయినబహిష్టుకు దేవిపిల్సు బాగుగ గుణమిచ్చును

1 అన్ని సందర్భములలోను శీఘ్రముగాను అమోఘముగాను పనిచేయును
2 ఏస్థితిలోను ఆరోగ్యమునకు ఎట్టిహాని కలిగింపదు

MANUFACTURERS SEENU & "O, MADRAS 21 | Selling Agents DEVI AGENCIES MADRAS-21

స్టాకిస్టులు మెస్సర్స్ ధర్మవీర్ అండ్ కం., ముదునూరువారి వీధి, గాంధీనగరం, విజయవాడ-3

## ఇది చాలా ఉపయోగం

పటిక వేడి చేసి తేలు కుట్టినచోట అంటించితే వెంటనే బాధపోతుంది నిత్య జీవితాని కుపయోగించే ఇలాంటి 200 అద్భుత రహస్యాలు 'చేతిపనులు' పుస్తకంలో వున్నాయి ఇతి చౌకగా మంచి బలానికి, పిప్పిపంటి పోటుకి, మొటిమలకు, మూలశంఖకు, శరీర నొప్పులకు, నరాలబలహీనతకు, గుండె బలానికి, వాతాన్ని పోగొట్టేవి, ఇలాంటి వెన్నో సులువుగా స్వంతంగా చేసుకొనే పద్ధతులున్నాయి ఇంకా అత్తర్లు, తల నూనెలు, సబ్బు, స్నో, టూత్ పేస్టు, పౌడరు మొదలైనవన్నీ చేసే పద్ధతులున్నాయి "చేతిపనులు" అనే ఈ పుస్తకం చాలఉపయోగమైనదిగా ఉన్నదని 3-8-52 న ఆంధ్రప్రభ వ్రాసింది వెల రు 3-50 న పై పోస్టుఖర్చులు ఉచితం ఇవి క్రిందిచోటమాత్రమే దొరుకును దేశసేవ ప్రచురణలు, ఏలూరు, ఆంధ్రకు వ్రాస్తే వి పి పోస్టులో వెంటనే మీకుకూడా ఒక పుస్తకం పంపబడును

SWASTIK



## పుష్పము మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవునదిన్నీ, మీ సరియైన చర్యను గురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టుకార్డుపైన మీకు ఇష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళవివరములున్నూ, మీ సరియైన చిరునామాయున్నూ వెంటనే వ్రాసిపంపండి జ్యోతిషశాస్త్రములోని రహస్య గణితము మూలముగామేము గుణించి, మీరు కార్డు వ్రాసినతేదీ అగాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవిత మార్గము, ఏ వ్యవహారములో మీకు జయము కలుగునో, ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మా ద్ద్రవ్యలాభము మొదలగువానిని గురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు 1 25న పై లకు మాత్రము వి పి గా పంపగలము (వి పి ఛార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహములేవైనా ఉన్నయెడల శాంతిచేయు విధానం కూడా తెలుపగలము వివరములు మా పూచీపైనపంపబడును మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా లేనిఎడల పైకము వాపసు చేయబడును ఒకసారి పరీక్షించండి అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

PT DEV DUTT SHASTRI, RAJ JYOTHISHI (A W P)
P B 86, JULLUNDUR CITY

## పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, వ్రేళ్లుపాతుకుపోయి పాదము నేలపై పెట్టలేక రాళ్లు తగిలిన త్రుళ్ళిపడు వారు పై పూతగా వాడిన వ్రేళ్లతోసహా మాయంచేయు. గల సంజీవి వెల పోస్టుఖర్చులతో రు 4-25న పై
కొక్కోకము చిత్రపటములు గలది రు 1-50
దాంపత్య రహస్యములు రు 3-00
తెలుగు హిందీ స్వయంశిక్ష రు 4-50
పోస్టు ఖర్చులు ప్రత్యేకము

ప్రభ అండ్ కో
3, మలయ పెరుమాళ్ వీధి, మద్రాసు-1.

## చెవుడు

మా ఉత్తమ చికిత్సా విధానం మామూలు వినికిడిశక్తిని మరల చేకూర్చ గలదు పరీక్షార్థ కోర్సు రు 17-97 పూర్తి కోర్సు రు 147-97.

Dr Sherman, FCS (usa)
181, R. N Guha Road,
Calcutta-28

## RATNAM'S N-OIL

(పై పూతకు మాత్రమే)

అంగనరములు బలహీనత చెంది, చిన్నదైనచో తిరిగి యధాప్రకారం అయి పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం|| ప్రఖ్యాతి గలది 1 సీసా రూ 10/-లు వి పి 1-50 కావలసినవారు ఎడ్వాన్సు పంపేది ఇందులో స్పెషల్ రకం అర్జంటు గుణమునకు రూ 25-00 లు వి పి రూ 2-00

**డాక్టర్ రత్నం సన్స్, Estd 1904)**
మలకపేట బిల్డింగ్, ఆజంపూరా మార్కెట్‌వద్ద,
హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

## నెలకు రు 300 సంపాదించండి

మీ తీరికవేళలలో లేక పూర్తివ్యవధితో మా రక రకాల పొగాకు సామగ్రులకు, పాన్-క-మసాల, హరి ఓం సువాసన మాత్రలకు, మరియు యితర ప్రఖ్యాత కమ్మని పదార్థములకు ఆర్డర్లు సేకరించి నెలకు రు 300/-సంపాదించండి

ప్రతినిధులు లేని ప్రాంతాలలో జిల్లావారిగా ఏజెంట్లు నియమింపబడుచున్నారు వ్యాపార షరతులకు, సాంపిల్ సెట్లుకు వ్రాయండి

**HARI MO & CO,**
8/30, Arya Nagar, Kanpur

## కొలంబా

ఎక్కువట. ఇటలీలో లుక్కా మొదలయిన ప్రదేశాలనుంచి కూలి వాళ్లని తెప్పించుకునేవారుట వీరిని 'లూక్వా' లంటారు-అ)ల కోసం తీసుకుపోతున్నాని చెప్పేస్తా" అన్నది చిలినా తడుముకోకుండా.

"వేటకాళ్ళ కెవరికయినా ఆకలి వేసి నీ దగ్గర ఫలహారాలన్నీ తినేస్తే ఏం చేస్తావు?"

"అంతటి ధైర్యం ఎవడికి ఉంది? మామయ్యతో చెప్పెయ్యనూ!"

"అంటే నీ దగ్గర సామాను లాక్కునే మనిషి లేదన్నమాట... మీ మామయ్యకి నువ్వంటే ఇష్టమేనా?"

"ఓ! చాలా యిష్టం ఆర్నెఆంటన్! మా నాన్నగారు పోయినప్పటి నుంచి మా అమ్మా నేనూ చెల్లాయీ ఆయన దగ్గరే ఉంటున్నాం. మా అమ్మ జబ్బుపడేముందు డబ్బున్న వాళ్ళందరితో చెప్పి పనులు ఇప్పించేవాడు! మేయర్ నాకు ప్రతి ఏడు బట్టలు ఇస్తాడు. చర్చి ఫాదరీ ప్రార్థన చెప్పటం, చదవడం నేర్పుతాడు కాని అందరికన్నా మీ చెల్లెలుగారే మాకు ఎక్కువగా సహాయం చేస్తారు!"

ఆ సమయంలో అటు ఒక కుక్క వచ్చింది ఆ చిన్నపిల్ల నోటిలో రెండువేళ్ళు పెట్టుకుని గట్టిగా ఈల వేసింది వెంటనే కుక్క ఆమె వద్దకు పరుగెత్తుకుని వచ్చింది దానిని ముద్దు చేసి పొదలలోకి పంపింది చిలినా.

ఆ తర్వాత మాసిన గుడ్డలలో ఉన్న ఇద్దరు వ్యక్తులు బయటికి వచ్చారు ఇద్దరి వద్దా కావలసినన్ని ఆయుధాలు ఉన్నాయి

"ఓహో! ఆర్నె ఆంటన్!' అన్నాడు వారిద్దరిలో ఎక్కువ వయస్సుకల మనిషి "నన్ను గుర్తుపట్ట గలుగుతున్నావా?"

"లేదు," అన్నాడు ఆర్నో అతని వంక తేరిపారచూసి.

"టోపీ, గడ్డం మనిషి నెంత మార్చివేస్తాయో చూశావా? లెఫ్టినెంట్ గారూ సరిగ్గాచూడండి. వాటర్ లూసంగతి మరిచిపోయావా?

## కొలంబా

(బాండో పావెల్లిని! యుద్ధభూమిలో నీ తుపాకిలో మందుగుండు పెట్టటానికి పక్కనే ఉన్నది ఎవరు?" (అప్పటికాలంలో తుపాకి కాల్చేవారి పక్కనే దానిలో మందు పెట్టటానికి మరొకరు ఉండేవారు—అ.)

"ఏమిటీ! నువ్వా?" అన్నాడు ఆర్నో "1816 లోనే సైన్యం వదిలి పారిపోయావుటగా!"

"నువ్వు చెప్పినట్లే జరిగింది

'లెఫ్టినెంట్!' అబ్బ, ఆ సైనికో ద్యోగం విసుగుపుట్టించిందనుకో! అదీకాక ఇక్కడ తీర్చవలసిన బాకీ ఒకటి ఉండేదిలే! హా! హా! చిలీ నువ్వు బలేదానివి. ఏదీ ఫలహారాలు బయటికి తియ్యి, ఆకలేస్తోంది లెఫ్టినెంట్ గారూ, పొదలలో ఎంత ఆకలి పుట్టుకొస్తుందో మీకు తెలీదు ఇవాళ ఎవరిచ్చారమ్మాయ్, కొలంబొ గారా, మేయర్ గారా?"

"కాదు మామయ్యా, పిండిమర నడుపుతున్నాయన అమ్మకోసమని ఈ శాలువ ఇచ్చాడు."

"ఆయన పనేమైనా చెప్పాడా?"

"ఆయనకింద పనిచేసే లుకాలు కూలీ గురించి తగవులాడుతున్నారుట!"

"దొంగ వెధవలు!.. నేచూస్తాలే. ఏమండీ లెఫ్టినెంటుగారూ మాతో పాటు భోజనానికి కూర్చుంటారా? ఈయనెవరో తెలుసా?" తనతో పే వచ్చిన వ్యక్తిని చూపిస్తూ అన్నాడు, "ఫాదరీగారు. ఆర్నోగారూ, ఫాదరీగారి పరిచయం చేసుకోండి ఫాదరీగారని ఆయన చెబుతున్నాడు, నాకు తెలీదు"

"ఏదోలెండి, దైవభక్తి, జిజ్ఞాసా కొంచెం ఉన్నవాడిని" అన్నాడు ఆ రెండవ వ్యక్తి. "అయితే నావృత్తి మాత్రం మార్చుకొవలసి వచ్చింది ఎవరు చెప్పగలరు? ఒకరోజు పోప్ అయి కూర్చుంటానేమో! ఏమంటావ్ బ్రాండలాచ్చియో?"

"ఎందువల్ల నీ అమూల్యమైన సేవ చర్చికి దక్కకుండా పోయింది?" అని అడిగాడు ఆర్నో

"ఏమీలేదు బ్రాండలాచ్చియో చెప్పినట్లు బాకీ ఒకటి తీర్చాను పైసాలో పుస్తకాలు 'మింగుతూ' ఉండేకాలంలో మాచెల్లెలు ఒకామె ఏదో తెలివితక్కువ పని చేసింది ఆమెకి పెళ్ళి చేద్దామని ఇక్కడికి బయలుదేరాను. కాని నేను ఈ

## కొలంబా

వోటు చేరే మూడు రోజుల ముందు కాబోయే పెళ్ళికొడుక్కి జ్వరం వచ్చి పోయాడు. ఏరేనస అతని తమ్ముడిని అడిగాను పెళ్ళి చేసుకోమని. అతనికి అప్పటికే పెళ్ళి అయిపోయిందిట. ఏమిటి చెయ్యడం?"

"చాలా చిక్కే వచ్చింది ఏం చేశారు?"

"తలలో ఒక తుపాకి గుండు పేల్చాను," అన్నాడు బందిపోటు మంచుగడ్డవలె కరుడుగట్టుకుపోయిన కంఠస్వరంతో.

ఆర్సో తన జుగుప్స ప్రకటించకుండా ఉండలేకపోయాడు. మనిషికి కనీసం ఒక హత్య అయినా చేసిన ఈ ఇద్దరిని వదిలివెళ్ళలేక అక్కడే వారితో మాట్లాడుతూ ఉండిపోయాడు.

బ్రాండలాచ్చియో రొట్టె, మాంసం మొదలయినవి బయటికి తీశాడు. తను కొంత వడ్డించుకుని, తనకుక్కకి కొంచెం వేశాడు-దాని పేరు 'బ్రుస్కో' ఎంత దొంగనయినా పట్టేస్తుందిట, ఒకరొట్టె ముక్క, పంది మాంసం ఖండమూ చిలినాకి ఇచ్చాడు

"బందిపోటు జీవితం బాగా లేదూ!" అని అరిచాడు దైవభక్తి, జ్ఞానపిపాసా కల మనిషి, కొన్ని ముద్దలు మింగిన తర్వాత "ఒక రోజు కష్టపడతారేమో గాని దెల్లా రెబ్బియా గారూ, ఆపైన మీ ఇష్టమే ఇష్టం కాదా! మీకు మీరే యజమానులు!" అంతవరకూ ఇటాలియన్‌లో మాట్లాడిన అతను ఫ్రెంచిలోకి మారుతూ అన్నాడు "కార్సికా నవయువకునికి నచ్చక పోవచ్చుగాని బందిపోట్లకి మాత్రం బలేగా ఉంటుంది ఇక్కడ ఆడవాళ్ళకి కూడా బుర్రలు పనిచెయ్యవు"

"మీకు భాషలు బాగా వచ్చులాగుంది," అన్నాడు ఆర్సో కొంచెం గంభీరంగా.

"ఫ్రెంచి మాట్లాడితే మీ చిన్న వయస్సుకి మర్యాద చేసినట్లేగా!"

"ఈ అమ్మాయికి పదిహేను ఏళ్ళు రాగానే పెళ్ళి చేసేస్తాను" అన్నాడు బ్రాంకలాచ్చియో. "అబ్బాయిని చూసేశాను"

"మీరే వెళ్ళి అడుగుతారా?" అని ప్రశ్నించాడు ఆర్నో.

"అనుమానం ఏమయినా ఉందా? నేనే గనక వెళ్ళి ఎవరినయినా 'నేను బ్రాంకో సావెల్లీని నీకొడుక్కి మిచెలినా సావెల్లీని ఇచ్చి పెళ్ళిచేద్దామనుకుంటున్నా' నంటే సందేహించే వారుంటారనుకుంటున్నారా?"

"మంచిపని కాదని నేను సలహా ఇస్తాలే," అన్నాడు అతని స్నేహితుడు.

"నేనే పట్టి దొంగనయితే," అని చెప్పుకుంటూ పోయాడు బ్రాంక లాచ్చియో, "పట్టి వెధవనయితే నా ఈముష్టిసంచి తెరుస్తాను. అందులోకి కాసులు గలగల రాస్తాయి."

"అందుగో నీ సంచీ," అన్నాడు ఆర్నో "ఎలా డబ్బునిఆకర్షిస్తుంది?"

"ఆకర్షించదు, నేనే రాస్తాను, ఒక ధనవంతుడికి, 'నాకు నూరు ఫ్రాంక్‌లు అవసరం' అని వెంటనే పంపించేస్తాడు నేను మర్యాదస్థుడిని లెఫ్టినెంట్ గారూ!"

ఫాదరీ అన్న బందిపోటు అన్నాడు, "దెల్లారెబ్బియాగారూ! మా పలుకుబడిని దుర్వినియోగం చేసే వెధవలు కొందరు ఈ దేశంలో ఉన్నారు తెలుసా? మా సంతకాలు 'ఫోర్జి' చేసి డబ్బు గుంజుతూ ఉంటారు!"

"తెలుసు!" అన్నాడు ముక్తసరిగా. "కాని ఏం చేస్తారు అసలు?"

(ఇంకా ఉంది)

## రాజధాని కబుర్లు

11 వ పేజీ తరువాయి

నిర్మించాలని 'టాంక్ బండ్‌ను' 'మెరీనా బీచ్' లాగ చెయ్యాలని ఆలోచనలు సాగుతున్నాయి ఇంకా ఎన్నో ఊహాగానాలు జరుగుతున్నాయి వీటన్నింటిని సమర్థించాల్సిందే! పట్నంలో అనేక గృహ నిర్మాణ కార్యకలాపాలు జరుగుతున్నాయి అనేక 'కాలనీలు' వెలిసినాయి కొత్త కొత్త హోటళ్లు భారీయెత్తున వచ్చి పడుతున్నాయి రోజురోజుకు జనాభా తాకిడి కూడా పెరిగి పోతోంది దీంతోపాటే అపరిశుభ్రం కూడా మితిమీరి పోతోంది డ్రైనేజ్ సిస్టమ్ ఉన్నా కూడా అదిలేని పట్నం మాదిరిగా కనిపించటం అవమానకరం పథకాలు వేసుకుంటూ, ముందుకు వెళ్లి పోవటంతోపాటు ఈ అనారోగ్యకర, పరిస్థితి, అసహ్యమైన దృశ్యాలు రూపుమాపటానికి కూడా తగు ప్రయత్నాలు చేస్తూనే ఉండాలి అప్పుడే రాజధాని నగరం కళకళలాడుతూ నిర్మలంగానూ పరిశుభ్రంగానూ, ఆకర్షణీయంగానూ ఉంటుంది లేకపోతే ఈనాటి పరిపాలనా విధానానికి ప్రతిబింబంగా నగరం కూడాకనిపిస్తూ ఉంటుంది —ఐ ఎల్ ఎస్ ★

"ఉపాయం ఉంది బాస్ !" (జేబులోంచి పిస్టల్ తీసి చూపిస్తుంది )

"సెబాష్ ! వెళ్ళండి ?"

అందరూ చేతులెత్తి ఆ సీటుకు అభివాదం చేసి వెళతారు

*   *   *

"పరుకు పోతే పోయింది సింగ్ ఏమయ్యాడు"

"పోలీసులకు చిక్కాడు బాస్ !'

"చిక్కాడా ? మీరంతా చచ్చారా ?"

'లేదు బాస్ ! సింగ్‌ను విడిపించాలని చూశాం వీలుకానప్పుడు కాల్చేశాం."

"సెబాష్ ! అదీ తెలివి. ప్రాణంతో పోలీసులకు దొరకకూడదు. దొరికాక ప్రాణంతో ఉండటానికి వీల్లేదు. నెంబర్‌ప్లేట్ మార్చేసి— మద్రాస్ రూట్‌కి తిప్పండి లారీల్ని."

"ఆ ముసలి రంగయ్య కనిపించలేదు బాస్ !"

"ఒక్కొక్కళ్ళే షూట్ చేస్తాను ! నెల రోజుల్నించి వెతుకుతున్నారు. ఒక్క ముసలి వెధవని పట్టుకోలేక పోయారు ! తిని తాగి చావమంటే తయారవుతారు !

"ఆ ముసలోడు కనిపించాడా మీ కాళ్ళముందు పడేస్తాం బాస్ !"

"నోర్ముయ్ ! కాళ్ళ ముందు పడేసి తర్వాత మాట్లాడు."

"అలాగే బాస్ ?"

"టార్జన్ ! పోలీసు వాళ్ళు జాగ్రత్త పడుతున్నారు ! బంగారు కడ్డీల్ని గోడౌన్ నుంచి గొర్రెలదొడ్డి షెడ్‌లోకి మార్చండి. రాత్రిం బగళ్ళు కావలా వెయ్యండి !"

బంగళా నౌకరుని నిలబెట్టి ఉంచుతారు రౌడీలు.

"ఊఁ ! తోయండి !"

రౌడీలు నౌకర్ని ముందుకు తోస్తారు. నౌకరు ముందుకి తూలి పడతాడు. స్విచ్ ఆన్ అయింది. మర మనిషి చేత్తో తాకగానే నౌకరు చచ్చి పోతాడు.

రహస్య మందిరంలో పాపకాలుని రెక్కలు విరిచి కట్టి నించో బెట్టారు. అతని వీపు వెనుక దూరంగా— సైతాన్— అతని చేతిలో కత్తి. పాపకాలు ఏ పరిస్థితిలోనూ వెనుతిరిగి చూసే అవకాశంలేదు.

"తాగించి తందనాలాడించినంత మాత్రాన మన గుట్టంతా చెప్పేస్తావన్నమాట.

"లేదు బాబూ లేదు. ఒళ్ళు తెలీలేదు. ఈ సారికి క్షమించండి !"

"నిన్ను తాగించిన మార్వాడీ కథంతా ఇప్పుడు తెలిసిందిగా !"

"తెలిసింది బాబూ ! ఆ దొంగనాయాల్ని"—

"ఇప్పుడు చంపేయ్ ! నిన్ను క్షమిస్తాను."

"......."

"మాట్లాడవేం ?" (కత్తి పాపకాలు కడుపులో ఆనించాడు.)

"ఈ కత్తికి నీ ప్రాణం ఇచ్చినా సరే— వాడి ప్రాణం తీసినా సరే !"

"బాబూ ! వాడి ప్రాణం తీస్తాను !"

"సరే ! ఫో! ఏర్పాట్లన్నీ చేస్తాను. ఊ ! గదిలోకి తీసుకుపొండి"

రౌడీలు పాపకాలును గదిలోకి తీసుకు పోతారు.

# అవీ - ఇవీ - అన్నీ

9 వ పేజీ తరువాయి

సైతాన్ మరోవైపు చూసి

"రాణీ!"

"యస్ ! బాస్ !"

"ఇలారా !"

ఇద్దరూ ఫోనున్న గదిలోనికి వెళతారు రాణి ఫోను మీద జేబురుమాలువేసి— ఫోను చేస్తుంది.

"ప్రసాద్ !. . . .నేనే. . . . పాపకాలు ఖిల్లాలో ఉన్నాడు. వెంటనేరా. . . .నేనే. . . ."

ఈ సన్నివేశం రవీంద్రా ఆర్ట్స ప్రొడక్షన్సు వారి "లక్షాధికారి" చిత్రంలోనిది. ఈ చిత్రంలో రామారావు, గుమ్మడి, రేలంగి, రమణారెడ్డి, నాగయ్య, కె. వి. యస్. శర్మ, కృష్ణకుమారి, గిరిజ, సూర్యకాంతం, మొదలగువారున్నారు.

మాటలు : వీర చిరంజీవి. పాటలు : కొసరాజు, సి నారాయణరెడ్డి, ఆరుద్ర, ఛాయ : సి నాగేశ్వరరావు సంగీతం టి చలపతిరావు, కళ : కృష్ణారావు, నృత్యం చిన్ని సంపత్, కూర్పు సంజీవి, దర్శకుడు వి మధుసూధనరావు, నిర్మాతలు డి వి రెడ్డి తమ్మారెడ్డి కృష్ణమూర్తి అసోసియేట్ దర్శకుడు పి పి రెడ్డి.



రకరకాల ఫ్యాషన్‌లు అందులో "ఎలిసబెత్ గ్రాంట్." దో్క రకం.

## శ్రీసత్యన్నారాయణ మహాత్మ్యం

ఆంధ్రాల విజయక వంతి దీపావళి మొదలగు ఉత్తమ చిత్రాలు నిర్మించి, సమర్పించిన కె. గోపాలరావు అశ్వరాజ్ పిక్చర్సు బేనర్ క్రింద "శ్రీ సత్యనారాయణ మహాత్యం" చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో యన్. టి. రామారావు, శ్రీ సత్యనారాయణస్వామిగా కనిపిస్తారని తెలుస్తుంది. రచన : సముద్రాల, సంగీతం : ఘంటసాల, ఛాయ : సి. నాగేశ్వరరావు. దర్శకత్వం : పి. యస్. సత్యనారాయణ. బి. ఏ.

పి. దగా, రాము.



కొత్త తరహా పాత్రలో నాగేశ్వరరావు. [పునర్జన్మ]

# కొత్తదనం గల కథతో పాటు కాలక్షేపం కూడా "పునర్జన్మ"

(నిర్మాత : ఎ. వి. సుబ్బారావు (పి. ఏ. పి.) దర్శకత్వం : ప్రత్యగాత్మ : రచన : ఆత్రేయ, ప్రత్యగాత్మ, సంగీతం: చలపతిరావు. నాగేశ్వరరావు, కృష్ణకుమారి, గుమ్మడి, వాసంతి, సంధ్య, సూర్యకాంతం, పద్మనాభం, రమణారెడ్డి, మొదలగువారు నటించారు.)

భార్యాభర్తలు, కులగోత్రాలు, వంటి చిత్రాలను తీసి జనామోదం పొందిన పి. ఏ. పి. వారు తీసిన తాజా చిత్రం పునర్జన్మ ఆగస్టు 23 వ తేదీన పత్రికల వాళ్ళకి చూపించినప్పుడు కథలోని కొత్తదనం ఇంచుమించు అందరిలోను, కుతూహలాన్ని కలిగించింది. గుల్షన్ నందా రాసిన ఈ హిందీ కథ 'ఫార్ములా' కథ కాదు.

ఒక శిల్పి చేతులారా నిర్మించుకున్న శిల్పం ("ఊర్వసీ అనవా ? ప్రేయసీ అనవా ?") సిగరెట్‌ను అజాగ్రత్తగా పారవేయడం చేత తగలడిపోయి, అతని మతిచెడి పోడం, వైద్యులు ఒక "ఆడే పాడే సుందరాంగి" సుశ్రూషలు అతనికి ప్రపంచజ్ఞానాన్ని ఇవ్వగలవని తీర్మానించగా, ఒక వేశ్యను శిల్పి తండ్రి అందుకు నియమించడం జరుగుతుంది. వైద్యం పనిచేస్తుంది గాని ఈలోగా పిచ్చిలోనే ఆ యువకుడు ఆ వేశ్య కన్యకు, బొమ్మల పెళ్లిలో తాళి కట్టడం — దరిమిలాన అతని సుఖం కోరి ఆమె దూరమవడం జరుగుతుంది — పిచ్చి రాకపూర్వం అతనిని ప్రేమించిన 'మరదలు' పిచ్చి వచ్చిన తర్వాత "బావను తనవాడిగా చేసుకోలేకపోయిన నేరం గ్రహించి ఫలాని వేశ్య ("మట్టిలో పుట్టిన మాణిక్యం") "నీకు ఈ పునర్జన్మ ప్రసాదించింది." అని చెప్పేస్తుంది. ఆ వేశ్యనే అతడు భార్యగా స్వీకరిస్తాడు. ప్రధానమైన ఈ ఇతివృత్తంలో హాస్యం కోసరం ప్రవేశించిన సైంటిస్టుగా రమణారెడ్డి, 'స్టూడెంట్స్'గా పద్మనాభం రాజబాబులు సైంటిస్టు భార్యగా సూర్యకాంతం ఉన్నారు. సర్దాగా చూడటానికైతే వీళ్ల 'పాత్రకల్పన' బాగుంది. కొత్త తరహా ప్రధాన పాత్ర "గోపీగా" నాగేశ్వరరావు ఆ పాత్రకు ఆలంబనగా ప్రాణం పోసే పాత్ర 'వేశ్య' రాధగా కృష్ణకుమారి నటించారు. ఇటీవల రెండు చిత్రాలుగా నిరుత్సాహపరుస్తున్న కృష్ణకుమారి, ఈ క్లిష్టమైన పాత్రను అత్యంత ప్రశంసనీయంగా పోషించింది — ఆమె ప్రతిభకీ చిత్రం 'తాఖీదు'గా భావించవచ్చును. 'తాళి బొట్టు' మీద ఆశ 'ఆలి'గా మనాలనే కోర్కె గల వెలయాలిగా ఈమె చూపించిన నటనా, కరుణతో పిచ్చివాడైన వాడి బాధ్యత నెత్తిన వేసుకున్న స్త్రీ మూర్తిగా ఈమె నటనా కూడా ప్రేక్షకుల సానుభూతిని పొందవచ్చును. ఈ చిత్రంలో సజీవమైన పాత్ర వాసంతిది. తనకు ఆట పాటా రాదు. బావ తనవాడు కాదు. కాని విద్యావతిగా సంస్కార పటిమను ప్రదర్శించి, ప్రేమకు గల సాంఘికమైన అవధులను అవసరాలను గుర్తించి, "బావా ! నీకు కాదగ్గ భార్య వేరే ఉందన్న వాసంతి పాత్ర ఒక్కటే వాస్తవికమైనది. ఈ చిత్రంలో ఈ పాత్ర ద్వారా వాసంతి కొక అందమైన తర్ఫీదు లభ్యమైందే గాని ఈ పాత్రకు మరింత అవకాశం ఇచ్చివుంటే బాగుండేది. అలాగే మంచి అవకాశం గోపీకి తాగుబోతు అన్నగా నటించి అందుకున్న నటుడు ప్రభాకరరెడ్డి, అలాంటి అవకాశం అందుకోలేని జాబితాలోకి రమణారెడ్డి, సంధ్య మొదలగువారు వస్తారు.

ఈ చిత్రం చిత్రీకరణ అంత సులువైనది కాదు. సామాన్య ప్రేక్షకుని స్థాయికి దీన్ని తేవడంలో నిర్మాతల కృషి ప్రశంసనీయమైనదే గాని సమీక్షకుని అభిప్రాయాలుగానే అయినా ఒకటి రెండు విషయాలు ఇక్కడ పేర్కొనడం అప్రస్తుతం కాదనుకుంటాము. మనిషి మతి చెడటానికి గల కారణాలలో లేదా మతి రాగల కారణాలలో ఏవి సత్యాలు ఏవి కావు అనే ప్రశ్నకు తావు లేదు. అవి ఈ చిత్రంలో మాదిరి జరగవచ్చును కూడా. ఈ చిత్రంలోని ప్రధాన పాత్ర 'గోపీ' ఒక 'శిల్పి'— 'కళా పిపాసి' అంటే తనే తన కృషికి ప్రతిఫలాలైన శిల్ప సుందరాంగనలతోనే తన్మయం పొందుతూంటాడు. ఐతే గోపీ తత్వమిలాంటిది అతడీరకం 'కళాకారుడూ' అనే ముద్ర ప్రేక్షకులపై పడటానికి ఈ చిత్రంలోని తొలి సన్నివేశం చాలలేదు. ఇందుకు ఇంకా ప్రాతిపదికగా (ఫౌండేషన్‌గా) ఒకటి రెండు సన్నివేశాలుంటే దరిమిలాన ఆ పాత్ర పిచ్చిదైనప్పుడు మరింత సానుభూతికి అవకాశం కలిగేది. ఈలాంటి చిత్రాలలో ఎక్కువ ప్రాతిపదిక, ప్రత్యేక వాతావరణ కల్పన (ఉదా : ఎలిజబెత్ టేలర్ నటించిన "సడన్లీ లాస్ట్ సమ్మర్") అవసరం. గోపీ పిచ్చివాడై పోయి తల్లిఫోటో దగ్గరికి రక్షణ కోసరం పరిగెడతాడు. ఈ లక్షణానికి ఆదివరకటి జీవితంలో ఒక కారణం; ఏదేనా చూపి ఉంటే ఇంకా సామాన్య ప్రేక్షకుని హృదయానికి కథ హత్తుకునేది. అలాగే వాసంతి పాత్రకు మరికాస్త 'పుష్టి'ని కలిగించవచ్చును. తనకు ఆటాపాటా రాక పోవడమే 'బావ' శిల్పసుందరులలోని సౌందర్యారాధన చెయ్యడానికి కారణమేమో అనే భావం మొదటు; అదే తపన ఆ తర్వాత చూపివుంటే, ఈ పాత్ర మరింత 'రక్తి' గట్టేది.

మొత్తానికి ఇందులో 'కొత్త'తో పాటు మామూలుగా సినీ ప్రేక్షకుల నలరించే, పాటలు (నీకోసం నీకోసం.... నా ప్రాణం నాగావం...) హాస్యం (పద్మనాభం కోడి నవ్వు,) సూర్యకాంతం కొత్త వేషం, ఎల్. విజయలక్ష్మి — నృత్యం కృష్ణకుమారి (పరదాలు తొలగె....దీపాలు వెలిగె..) నృత్యాలు ఇవన్నీ గాక, ఈ సంస్థకు ప్రత్యేకత నిచ్చిన సాంకేతిక ప్రమాణాలు 'సీట్ ప్రెజెంటేషన్' ఇవి ఈ చిత్ర విజయానికి దోహదమిస్తాయి. ఈ రకం క్లిష్టమైన కథను సామాన్య ప్రేక్షకుని స్థాయికి తేజారిన నిర్మాతలు అభినందనీయులు.

క్రిటిక్. ★

ఒక పక్కన పన్నులు కనీసం 25%కి పెరుగుతూంటే ఇంకో పక్కన జీవన వ్యయంకూడా, అదే శాతంలో పెరిగి పోతుంది ఇంకో ప్రక్కన ప్రతివాడు తన నెలసరి ఆదాయంలో కొంత ధనాన్ని వచ్చినట్లు పొదుపు చేసుకోవాలని శ్రీ మొరార్జీ ఒక శాసనాన్నికూడా చేయించాగ

## న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

అయినా పెద్ద పెట్టుబడులు, కృష్ణమాచారికి వ్యతిరేకంగా మొరార్జీని సమర్థిస్తూనే వున్నాయి

అన్ని దేశాల్లో మాదిరిగా మనదేశంలో కూడా కమ్యూనిజానికి దోవచూపేది ఈ భారీ పెట్టుబడులే అసలు గమ్మత్తేమిటంటే తమలో తమకు పడకపోయినా, మీనన్ వర్గం, మొరార్జీ వర్గం, కూడా శ్రీ టి టి కె కి వ్యతిరేకంగా పని చేస్తున్నాయి

లోగడ నేచెప్పినట్లుగానే, పరిశ్రమల శాఖ పునర్నిర్మాణం, ఆర్థిక మంత్రి ఎన్నిక బట్టే ఉంటుంది శ్రీ కృష్ణమాచారి ఆర్థిక మంత్రి ఐనా కాకపోయినా, ఆర్థిక— రక్షణ సహకార శాఖ, పరిశ్రమలు, భారీ పరిశ్రమల శాఖల మరమ్మతు మాత్రం తప్పనిసరిగా జరగాల్సి ఉంది. పరిశ్రమలలో సంబంధం గల శాఖలను కలిపివేసి, కావాలనుకుంటె, సరఫరాలు, అభివృద్ధి విభాగాలను దీనికి కలపవచ్చు

సరే ఇక గుల్జారీలాల్ నందా విషయం ఆయనకు ఆహార— వ్యవసాయ శాఖను అప్పగిస్తే చాలా బాగుంటుంది కారణమేమంటే ఈయన కమ్యూనిస్టుల వత్తాసి (కేవలం వాగ్రూపమేననుకోండి) తో ఆహార వ్యవసాయ మంత్రి శ్రీ యస్. కె పాటిల్‌ను ఆయన వ్యవసాయోత్పత్తులు పెంచలేక పోయారని విమర్శించేవాళ్ళుగదా ! ఇప్పుడు నందాజీని ఆహార వ్యవసాయశాఖను తీసుకోవలసిందిగా ప్రధాన మంత్రి అడగాలి ఆ మాటల మధ్య నాకో విషయం జ్ఞాపకానికి వస్తోంది. ప్రపంచ యుద్ధం రోజుల్లో లోగడ స్వర్గీయ మాంటేగు ఒకసారి, మెసపటోమియా విషయంలో 'గవర్నమెంట్ ఆఫ్ ఇండియా' విధానాలు విఫలయయ్యాయని ?, బ్రిటిష్ హౌస్ ఆఫ్ కామన్స్‌లో ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు. బ్రిటిష్ ప్రధాని ఆ మర్నాడే శ్రీ మాంటేగును భారత వ్యవహారాల మంత్రి పదవిలో నియమించారు దాని ఫలితమేమిటయ్యా అంటే భారత స్వాతంత్ర్యానికి దారితీసే మాంటేగు— చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు వచ్చాయి అలాగే శ్రీ గుల్జారీలాల్‌నందాను ఆహార — వ్యవసాయ శాఖకు మంత్రిగా నియమిస్తే అది ఆహారం విషయంలో దేశ స్వాతంత్ర్యానికి దారితీయవచ్చు. ఈయన చేస్తున్న ప్రణాళికలలోని 'మరమ్మత్తు'లను చూసి మురిసిపోయి మన ప్రధాన మంత్రి దేశీయ వ్యవహారాల పదవిని కట్టబెట్టాలనుకున్నారు ఈ పనివల్ల ప్రధాని లోగడ స్వర్గీయ పండిత పంత్, శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి చేసిన మంచి పనులను తోసిపారేసి దేశీయ వ్యవహారాల శాఖను లోగడ పండిత కైలాసనాథ కట్జూ దిగజార్చిన స్థాయికి తీసుకుపోవాలనుకున్నారో ఏమో! ఈ వార్తవల్ల ప్రణాళికా సంఘ ఉపాధ్యక్షుల పదవికి తగాదాలను పోటీని (అనుకోకుండా వచ్చిందేంకాదు) తెచ్చి పెట్టింది ప్రణాళికా సంఘ స్థాయే మారి పోయింది కనుక దాని ఉపాధ్యక్షుడెవరైనా ఒకటే

ఇప్పటి వార్తలవల్ల, సర్దార్ స్వర్ణ సింగ్‌ను ఆహార వ్యవసాయశాఖ మంత్రిగానూ, న్యాయ మంత్రి అశోక్‌సేన్‌ను రైల్వేల మంత్రిగాను నియమిస్తారని తెలుస్తున్నది

[ఈ లేఖ మంత్రివర్గం మార్పులకు ముందుగా వ్రాసినది— సం॥]












Edited, Printed and Published by S Radhakrishna at the AndhraPatrika Press, 6 &7 Thambuchetty Street Madras 1. Chief Editor S Sambhu Prasad.



నాట్యనటి రాజసులోచన (ఫొటో ప్రభాకర్)

